సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 22 నవంబర్ 1979 సంచిక 11

## విషయానుక్రమణిక



### —: శ్రీవారి కార్యక్రమములు :—

బాబావారు ప్రశాంతి నిలయమునందున్నారా అని తెలిసికొనగోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెఱువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

### చందాదారులు గమనించండి !

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితములోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆనెంబరు "…/-12-1979" అనియుండిన, మీచందా డిసెంబర్ నె.తో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) నవంబర్ నెల 30వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.
వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

11

జగత్తు బ్రహ్మాండము. అందు జీవుడొక పిండము. ఈ రెంటియందలి మూలసత్యము మాత్ర మొక్కటే. ఈ మూలసత్యమును నెద్దానితోడను సంబంధించని సత్యముగా చూడగలినచో అద్దానిని బ్రహ్మమందురు. జగత్సందర్భమున వ్యవహరించునపుడు బ్రహ్మ మునే పరబ్రహ్మమందురు. జగత్తులోని మూల సత్యము ఆత్మ. మానవునిలోని మూలసత్యము కూడా ఆత్మయే. ఈ ఆత్మకు భిన్నముగా తోచున దంతయు మిథ్యాస్వరూపము. అనగా విచారించునంతవరకు సత్యమువలె కానవచ్చి విచారించినతరువాత అసత్యమని తెలియబడు దానిని మిథ్య మందురు. ఇట్టి మిథ్యా ప్రపంచము మాయా జీవితము. మనకు ఆత్మ భిన్నమగుస్థానము లేదు. అందువలన మాయ ఆత్మయొక్క శక్తి అనబడును. శక్తి సంబంధి తుడుగా ఆత్మ వ్యవహరింపబడుచున్నప్పుడు పరమాత్మ అనబడును. ఆత్మ స్వరూపము సచ్చి దానందము. సత్తు చిత్తు ఆనందమని మూడుగ వ్యవహరింపబడుచున్నను అవి భిన్నములుకావు. అవి అతనియొక్క యేకస్వరూపము. అటులనే దేవాత్మకశక్తి అనబడు మాయకును సత్యము, రజస్సు, తమమను మూడు గుణములు కలవు. అవియే జ్ఞానేచ్ఛా క్రియేచ్ఛా శక్తులుగ పరిణ మించును. సత్యము, జ్ఞానమును, రజస్సు ఇచ్ఛను, తమము, క్రియాశక్తి తనతో కలసి యున్నదగుటవలన అనేకమువలె భాసిల్లును. ఈ అనంతశక్తియే జగన్నిర్మాణ కర్త్రి. ఆమె ప్రథమమున, శుద్ధ సత్త్వ ప్రధానురాలై అద్దము వలె నిర్మలమగుట వలన యెదుటి వస్తువును

తనయందు ప్రతిఫలింప జేసికొను శక్తిమంతు రాలు. తన ఆశ్రయమగు నాత్మయందు ప్రతి ఫలించినపు డీశ్వర సంజ్ఞను బొందును. అట్టి పరమాత్మయే తనశక్తి మహిమవలన జగత్స్వ రూపముగ పరిణమించును. ఈ పరిణామము మాయదేకానీ అందుగల ప్రతిబింబమైన ఈశ్వరు నిది కాదు. నిర్మలమగు జలము క్షోభిల్లుట వలన మలినమగు నురుగుగను బుడగలుగను వ్యవహరింపబడునట్లు మాయా విజృంభణము వలన ఆత్మయే జగదాకారముగ నామరూపము లతో భాసిల్లును. మాయ యొక్క రజస్తమో గుణములు చలించని స్థితిని అవ్యక్తమని అం దురు. ఈ అవ్యక్త స్థితియందు సర్వ జగత్తు బీజభావమున ఆమె యందు అణగి యుండును.

రజస్తమములు చలించినపుడు సృష్టి వ్యక్త మగును. వీని చలనములు జీవుల కర్మ సంబం ధములు. శుద్ధతత్త్వ ప్రాధాన్యమును పట్టి ఆమెను మాయ అని అందురు. రజోగుణ ప్రాధాన్యమును పట్టి అవిద్య, లేక అజ్ఞానమని అందురు. తమో గుణ ప్రధానమును పట్టి తామసి అని అందురు. సాత్త్వక మాయ యందు ప్రతిబింబించిన ఆత్మ ఈశ్వరుడనియు రజోగుణమైన అవిద్యయందు ప్రతిబింబించిన ఆత్మ జీవుడనియు తమోగుణ మైన తామసికమునందు ప్రతిబింబించిన ఆత్మ ద్రవ్యమనియు అందురు. దీనినిపట్టి ఉపాధులభేద మువలననే ఈశ్వరుడని జీవుడని ద్రవ్యమని సంజ్ఞలు కలిగెను కానీ ఉపాధులు లేని యెడల మూడును ఆత్మ పదార్థమనియే చెప్పవచ్చు. ఈ ప్రపంచమంతయూ ఈశ్వర జీవ భూతములనెడి మూడు తత్త్వముల పరిణామములే.

జీవుని భోగార్థమై ఈశ్వర సృష్టి యేర్పడి నది. మాయ అవిద్య తమములయందు ఆత్మ ప్రతిఫలించెననునప్పుడు ముఖ్యముగ గమనించ దగిన అంశ మొకటి కలదు. అద్ద మొక ఉపాధి. దీని శక్తి ఎదుటి వస్తువులను ప్రతి బింబింప చేసికొనుట. కానీ అద్దము యొక్క మలిన వక్రాదులతో అందలి ప్రతిబింబములకు వా స్తవముగ నెట్టి సంబంధమును లేదు.

అట్లున్నను మనచే అజ్ఞానమువలన అద్దము నందలి మాలిన్య వక్రాదులను ప్రతిబింబమున కాపాదింపబడుచున్నది. అటులనే బ్రహ్మమునకు మాయావిద్యల సంబంధము లేకున్నను అజ్ఞానం వలన నున్నట్లుగా భావింపబడుట తటస్థించు చున్నది. పరమేశ్వరుని ప్రతిబింబముతో కూడి మాయయే పాలు పెరుగుగ పరిణమించినట్లు జగద్రూపముతో పరిణమించినది. ఈ పరి ణామము మాయదేకానీ అందలి ప్రతిబింబముది కాదు. మాయ తన్నాశ్రయించి యుండుటవలన అనగా స్వాధీనము కలవాడు కనుక మాయా శక్తి ప్రభావములకు తానే ప్రభువు. అందుచే పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు అని తెలియబడుచున్నాడు. జీవేశ్వర భూతము లను మూడు తత్త్వములలో జీవుని భోగార్థమై ఈశ్వర సృష్టి యేర్పడినది. ఈశ్వరుడు ఆప్త కాముడు. విశ్వము నందలి సర్వ భోగములు

ఆతని నుండియే ప్రభవిల్లుచున్నందున యాతడు కోరున దెట్టిదియూ నుండజాలదు.

ఈశ్వరుని సృష్టి రచన జీవభోగార్థమే కానీ తన ప్రయోజనము కొరకు కాదు. "నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషుయాకేషు కించన" సృష్టి అతని స్వభావము. కావుననే లీలా వినోది అనుట పటస్థించినది. ఈతని శక్తివలననే సర్వ జీవరాసులు చైతన్యము కలిగి ప్రవర్ధిల్లుచున్నవి. అతడు కర్మ, ఫలముల నొసంగు వాడగుటవలన కర్మఫల ప్రదాత అనబడును. పరమేశ్వర సంబంధ రహితముగ కర్మ ఫలముల నొసంగ జాలదు. ఈ కర్మకు ఇట్టి ఫలమని జడమగు కర్మ నియోగించుకొనజాలదు. అదియునుగాక కర్మక్షణికము అని ఆర్య వచనము. కర్మానంత రము చేకూరినది ఫలము. ఈ ఫలము ఎప్పుడు చేకూరునని గానీ, కర్మ వాసన యెప్పటిదని చెప్పుట కానీ సాధ్యముకాదు.

అట్టి విషయమునే ఈశ్వరాజ్ఞ అనుట తట స్థించెను. మన బుద్ధి కందనిది ఈశ్వరాజ్ఞ, ఎన్ని జన్మలెత్తినను కర్మఫలము ననుభవింపక తీరదు. ఈ కర్మ ఎప్పటిది అను ప్రశ్నకు చోటులేదు. ఇందులకు కర్మ యొక్క అనాది త్వము కారణమైయున్నది. ఈశ్వరుడు జగత్తు జీవుడు కర్మ అజ్ఞానము అను వానికి మొదలను నది లేదు. ఇవి అనాదులని చెప్పబడును. అందులకే భగవద్గీత యందు కృష్ణుడు గహనా కర్మణోగతిః". కర్మయొక్కగతి దుర్జ్ఞేయమని సూచించి యున్నాడు. కర్మఫలములనేకజన్మల అనంతరము కూడా రాగలవు. అందువలన సర్వ కర్మాధ్యక్షుడు సర్వ సాక్షియునగు పర మేశ్వరుడు ఒక్కడే కర్మఫల ప్రదాయకుడు. అతనొక్కడే అర్హుడును ప్రభువును అయి ఉన్నాడు. ఈ దృక్పథమునుండి పరిశీలించిన ఈశ్వరుని యునికి జీవునియొక్క యునికితో సంబంధము కలిగి యున్నదని తట్టకపోదు. చెప్పక తప్పదు. జీవులు లేనియెడల ఈశ్వరు డుండబోడు. పుత్రుడు లేనియెడల తండ్రి అను నామ మర్థరహితము. కావున జీవుల కర్మఫల భోగార్థమే పరమేశ్వరుడు సృష్టి రచనకు పూనుకొనుననునది యుక్తి సిద్ధము. ఇక భూత పదార్థము అనగా ఆకాశాది పంచ భూతములు జీవభోగార్థములకును జీవుల దేహ నిర్మాణములకును వారల కర్మల ననుసరించి నివసించు లోకాదులకును జీవనోపకరణములు గను వినియోగింపబడును. కర్మల ననుసరించి నివసించు లోకాదులనుట యేలయనుకొన్న మహ త్తర పుణ్యములకును, కొన్ని ఘోర పాపముల కును మనకు కానవచ్చు లోకముకానీ, దేశ ములు కానీ పనికిరావు.



# ఆత్మ ప్రేమ

ఉ॥ చక్కెర కంటె తీపి, దధిసారము కంటెను
రుచ్యమౌను కెం
పెక్కిన తేనెకన్న అతి తృప్తినిడున్ మది పల్కి
పల్కి పెం
పెక్కుచునుంటచే అమృతమే యనిపించును
గాన నిత్యమీ
చక్కని దాని మీరు మది సంస్మరియింపుడు
కృష్ణ నామమున్
నిత్యమున్ మదిలో స్మరియింపుడు కృష్ణ
నామమున్.

ప్రేమ స్వరూపులారా!

సువిశాల జ్ఞానతత్త్వాన్ని స్వీకరించలేని, జీవిత అంతరాంతరాలలో ప్రవేశింపలేని నేటి మానవులు విశ్వశ్రేయస్సును సాధించుట అసాధ్యమైన కార్యము. విశ్వశ్రేయస్కరము సమాజశ్రేయస్కరముపై ఆధారపడి ఉంటుంది. సమాజము యొక్క శ్రేయస్కరము మానవునిపై ఆధారపడి ఉంటుంది. ఏతా వాతా విశ్వశ్రేయస్సు, సమాజ శ్రేయస్సు, వ్యక్తి శ్రేయస్సు, ఇది త్రిమూర్తిస్వరూపాత్మకంగా గోచరిస్తూ ఉంటుంది. అన్యోన్యాశ్రితము. అవినాభావసంబంధము.

ప్రపంచము యొక్క శ్రేయస్కరము కేవలము మానవునిపై ఆధారపడి యుండటం చేత వ్యక్తిత్వము యొక్క దివ్యత్వాన్ని, గుర్తించుకోవాలి. ప్రపంచము శ్రేయస్కరము కానిదే క్షేమంకరము కానేరదు. క్షేమం కరము కానప్పుడు శాంతి లభించదు. ఏనాడు శాంతి లభించదో, ఆనందము మనకు అతిదూరము. ఆనందము అతిదూరమైన వ్యక్తి ఆత్మ తత్త్వమును ఏరీతిగా గుర్తించగలడు?

ఈనాడు లోకములో శాంతివచనములు చెపుతూ అశాంతికి సంబంధించే కార్యములు ఆచరించే వ్యక్తిత్వము అధికం కావడం చేతనే, ఆధ్యాత్మిక మార్గము అత్యంతదూరముగా ఉండవలసివచ్చింది. జీవితములో వివిధ పరిధుల మధ్య, సామరస్యము సమంజసము ఉండినప్పుడే జీవితము అర్థవంతమవుతుంది. ఎన్ని పర్యాయములు లెక్కించినప్పటికినీ, పరమానందయ్య శిష్యులకు ఒక్కటి తక్కువగానే కనిపిస్తూవచ్చింది. అటులనే అంతా తెలుసుకున్నామనే వ్యక్తులు ఆకాశమునకు ఎగిరినప్పటికినీ. అశాంతికి గురికావటములో, ఆనందాన్ని కోల్పోవటములో ఉన్న రహస్యము ఏమిటి? ఇది లెక్కల లోని వ్యత్యాసమా? చుక్కలను లెక్కించినప్పటికినీ, చంద్రుని తాకినప్పటికినీ, తనను తాను గుర్తించుకోలేని వ్యక్తి సమత్వాన్ని ఏనాటికినీ పొందలేడు. సమర్థతను ఏనాటికినీ సాధించలేడు. సమర్థత అనేది బాహ్యప్రపంచమునందు దొరికేదికాదు. అంతర్దృష్టియందే లభ్యమౌతుంది. సమర్థతను మనం సాధించినప్పుడే నిజద్రష్టలు కాగలము. నిజద్రష్టకు మాత్రమే ఆనందము ప్రాప్తించును. ఈ నాడు లోకములో బంధనలు ఏమిటో గుర్తించినప్పుడే దాని విముక్తికి ఉపాయములు వెతుక్కొనుటకు అవకాశముంటుంది. కానీ ఈనాటి మానవుడు బంధనలంటే ఏమిటో తాను గుర్తించుకోలేని అవ్యక్తములో తానుంటున్నాడు.

ఆలుబిడ్డలు బంధనలనీ, ఆస్తిపాస్తులు బంధనలనీ, మమకార అభిమానములు బంధనలనీ భావిస్తూఉన్నాడు. కాదుకాదు. ఇవి బంధనలు కావు. ఇవియే బంధనలైన, వీనినుండి తప్పుకొనుటకు అంత ప్రయత్నము చేయనక్కరలేదు. ఆలుబిడ్డలను వదలుట అంత గొప్పకాదు. ఆస్తిపాస్తులను విసర్జించినవారు అనేకులు లోకములో లేక పోలేదు. అభిమాన మమకారములు కోల్పోయిన వ్యక్తులు కోటాను కోట్లుగలరు. వీరందరూ బంధవిముక్తులేనా ? కాదు కాదు.

ఇవి కాదు మనకున్న బంధనలు. తానెవ్వరో తానుతెలుసుకోకుండా ఉండినంతవరకు ఉన్న తత్త్వము బంధన. తనను తాను తెలుసుకో లేనటువంటి అవ్యక్తమే బంధనము. తనను తాను తెలుసుకోలేని వ్యక్తిత్వము ఇక ఎంతవరకైననూ ఈ బంధనలో ఇరుక్కొనుటకు అవకాశముంటుంది. ఈ బంధము ఉండినంతవరకు దుఃఖము తప్పునది కాదు దుఃఖముండినంతవరకూ ఆనందము లభ్యముకాదు. అయితే ఈ దుఃఖమునకు కారణము ఏమిటి ? కేవలము తనను తాను తెలుసుకొనలేక పోయినంతమాత్రాన, దుఃఖమా? కాదు. ఈ దుఃఖమనేది అసత్తుచే తమస్సుచే మృత్యువుచే ఏర్పడుచున్నటువంటిది. కనుక అసత్తు, తమస్సు, మృత్యువు ఈ మూడింటి ద్వారానే మానవునకు దుఃఖము ప్రాప్తిస్తూ ఉన్నది. అసత్తును ప్రకృతిని సత్యముగా భావించి, నిత్యముగా విశ్వసించి, మనము భ్రమించి, దానికి లోబడిపోతున్నాము. ప్రకృతియందు ఎంతకాలము ఎన్నివిధముల ప్రయత్నించినప్పటికినీ, శాశ్వతమైన పదార్థాన్ని చూడలేక పోతున్నాము. నిరంతరము మార్పుచెందునవే ఈ వస్తువాహనాదులు కానీ, వ్యక్తిత్వము కానీ, గుణత్వము కానీస్థిరముగా ఏనాటికీ కనిపించడంలేదు కనుక అసత్తైనటువంటి జగత్తు మనకు సత్యభావముచే మనమున్నంతవరకునూ, ఈ దుఃఖము మనకు తప్పింది కాదు. కనుక జగత్తనే భావమును మరవవలెను. అప్పుడే మనకు దుఃఖము నివృత్తియగును.

ఇంక జీవుడనగా ఎవరు ? ఈ పంచభూతములచే, పంచకోశములచే, పంచప్రాణములచే, పంచ దృశ్యములచే; నిండియున్నంత మాత్రమున మనము ఒక జీవతత్త్వముగా భావిస్తున్నాము. ఇది జీవతత్త్వము కాదు. కనుక దీనికి అతీతమైన దివ్యత్వము భవ్యత్వము నవ్యత్వము నిత్యనూతనమైన ఆత్మతత్త్వము ఒకటి ఉన్నది. నిరంతరము వికాస తత్త్వముతో కూడిన ప్రకాశతత్త్వము ఒకటి ఉన్నది దివ్యత్వమైన పవిత్రతతో కూడినది ఒకటి ఉన్నది. ఆధ్యాత్మికవికాసము లేనటువంటి జీవతత్త్వము పశుత్వముతో సమానము. కనుక ఇట్టి పవిత్రమైన జీవతత్త్వాన్ని మనము తెలుసుకునేంతవరకునూ, మనకు దుఃఖము తప్పునది కాదు.

ఇంక దైవమనగా ఏమిటి? ఈమృత్యుత్వము అనగా ఏమిటి ? దేనికి మృత్యువు కలుగుతున్నది ? ఈ సత్యాన్ని కూడ మనం విచారించాలి. పుట్టినదే గిట్టును. జన్మించిన దానికే మృత్యువు కనుక జననమే లేనటువంటి దానికి మరణమెక్కడినుండి వస్తుంది ?

చావు పుట్టుకల్ లేనట్టి శాశ్వతుండు.
ఆది మధ్యాంత రహితుం డనాది వాడు,
చావక యె తాను చంపక, చంపబడక,
అంతటను సాక్షియైయుండు ఆత్మ యెపుడు.

ఇట్టి ఆత్మతత్త్వాన్ని ఏనాడు మనము సంపాదించుకొందుమో ఆనాడే మనకు దుఃఖ నివృత్తి. కనుకనే అసత్తును వదలటము తమస్సును గుర్తుంచుకోవడము, శాశ్వతమైన బ్రహ్మతత్త్వాన్ని పొందడము. మరవవలసిన దాన్ని మరచినప్పుడే మనకు దుఃఖ నివృత్తి. తెలుసుకోవలసినదాన్ని తెలుసుకున్నప్పుడే మనకు

ఆనంద ప్రాప్తి. చేరవలసిన గమ్యాన్ని చేరినప్పుడే మనకు ఆత్మానందము. ఇట్టి పవిత్రమైన త్రిమార్గములను గుర్తించుకునే నిమిత్తమై 'అసతోమా సద్గమయా, తమసోమా జ్యోతిర్గమయా, మృత్యోర్మా అమృతం గమయా,' అనే మూడు విధములైన ప్రార్థనలు చేస్తూ వస్తున్నాము. కనుకనే ఈ అసత్తైన జగత్తును మనము మరవవలెను.

ఇంకా మనము కనుక్కోవలసినదివుంది. ఇది జీవ తత్త్వము కాదు. ఇది బ్రహ్మతత్త్వముఅనే సత్యాన్ని గుర్తించవలెను. ఇది బ్రహ్మతత్త్వము అనేది గుర్తించుకున్న తర్వాత అందులో ఐక్యము అవుటకు ప్రయత్నించవలెను. దీనినే 'అథాతో కర్మజిజ్ఞాస, అథాతో బ్రహ్మజిజ్ఞాస' అన్నారు. కర్మ జిజ్ఞాస మొదలు, ధర్మజిజ్ఞాస రెండవది. బ్రహ్మజిజ్ఞాస మూడవది. జిజ్ఞాసతత్త్వము లనే త్రిమూర్తులను అనేక విధములుగా పండితోత్తములు వాదోపవాదములు చేసి అనేక విధములుగా దీనిని శోధిస్తూ వచ్చారు. కర్మ జిజ్ఞాస జరిగినప్పుడే ధర్మజిజ్ఞాసలోని రహస్యాన్ని మనం గుర్తించడానికి వీలవుతుంది. ధర్మజిజ్ఞాసను గుర్తించినప్పుడే బ్రహ్మజిజ్ఞాసకు అపేక్ష పడతాము. వేదమునందు మొదలు కర్మకాండ, రెండవది ఉపాసనా కాండ, మూడవది జ్ఞానకాండ అని విభజిస్తూవచ్చారు. కర్మ ద్వారానే జ్ఞానములభించును. కర్మ నిమిత్తమై కాయము ఏర్పడినది. ధర్మ జిజ్ఞాస నిమిత్తమై మనస్సు ఏర్పడినది. దీనినే మనోవాక్కాయ కర్మలు అన్నారు. మనస్సు సంకల్పములకు ప్రధానమైనటువంటిది. అభిప్రాయములను వెలిబుచ్చుటకై వాక్కు అత్యవసరము. ఈ రెండిటినీ కార్యరూపములో సాధించుటకై క్రియ ఆచరించవలసియున్నది. కనుకనే త్రికరణశుద్ధి కూడ మానవునికి అత్యంత అవసరము.

మనం ఇంటిలో నిత్యమూ ఏదో ఒకవిధంగా భుజిస్తూ ఉన్నాము. ఈ ఆహారమును భుజించే సమయములో, ఒక చట్నీని నూరినామనుకోండి. ఇది నూరిన తర్వాత ఒక్కతూరి నాలుకపైన వేసుకుని రుచిని చూశాము. ఈ చట్నీలో ఉప్పు తక్కువగా ఉందని తెలుసుకున్నాము. ఈ ఉప్పు తక్కువగా ఉన్నప్పుడు ఏం చేస్తాం? ఉప్పును తిరిగి కలుపుకోడానికి ప్రయత్నిస్తాము. చట్నీని మనం రెడీ చేయుటయే కర్మ జిజ్ఞాస. దీనిని రుచి చూడటమే ధర్మ జిజ్ఞాస. ఇందులో బ్రహ్మమనే ఉప్పు లేదని తెలుసుకోవడం, ఉప్పును కలుపుకోవడమే బ్రహ్మ జిజ్ఞాస.

జన్మించడమే ఒక కర్మ జిజ్ఞాస. మన జననమే కర్మకు మూలకారణము. కర్మద్వారా మనము కొన్ని ధర్మములు ఆచరిస్తూ వచ్చాము. ఈ ధర్మములో ఆనందము లభించలేదని నిరాశకు గురి అయ్యాము. ఈ ఆనందమనేది బ్రహ్మము నుండి చేర్చుకున్నప్పుడే మనకు పవిత్రంగా ఆనందము అనుభవించడానికి అవకాశముందని గుర్తించుకున్నాము. కర్మను ఆచరించినంతమాత్రమున జన్మసార్థకము గావించుకున్నామని భావించరాదు. కర్మ, ధర్మ స్వరూపంగా నిరూపించాలి. కర్మను బ్రహ్మ స్వరూపంగా రూపొందింపచేసుకోవాలి. ఇదియే మానవుని కర్తవ్యకర్మ. కనుకనే ఉపనిషత్తులు 'కారుణ్యం పరమం తపం' అన్నవి. సర్వభూతములయందు కారుణ్యమే తపస్సు అన్నారు. ఇదియే ఆత్మ తత్త్వమని కూడ శ్రుతులు బోధిస్తూ వచ్చాయి. ఈ కారుణ్య తత్త్వమనేది మానవుని యొక్క దైవత్వమునకు ఎంతవరకు మార్గంగా ఏర్పడుతుందో విచారించుకోవాలి

'జంతూనాం నరజన్మదుర్లభం' జీవులన్నింటి కంటే ఉత్తముడు మానవుడు అన్నప్పుడు, మానవుడు ఎట్టి జీవితము గడపాలి? ఎట్టి సాత్త్వికాన్ని అనుభవించాలి? త్యాగ, అహింస, కరుణతో ఉండవలసిన మానవత్వము కేవలము స్వార్థము, అహంకారము, అసూయ క్రోధముచేత మృగములకంటే హీనమయ్యే

పరిస్థితియందు ఈనాడు మానవుడు సంచరిస్తున్నాడంటే ఇందులో దోషమేమిటి? లోపమేమిటి? అంతరార్థమేమిటి? మానవ జీవితము మొదటినుండీ దయ, ప్రేమ, సహన, కరుణ, ఆనందములచే కూడిన దివ్యత్వముగా రూపొందుతూ వచ్చింది. సాత్త్విక గుణములు నిర్మూలమై, దుర్మార్గమైన గుణములు నిర్మాణమై మానవత్వాన్ని నిర్మూలము గావించుకునే ఈ తత్త్వానికి రావడానికి ఏది కారణము? ఆవుల దొడ్డిలో పులి జొరపడినప్పుడు ఆవుల పరిస్థితి ఏ రీతిగా ఉంటుంది? అక్కడ ఆవులు బ్రతుకుటకు వీలవుతుందా? వీలుకాదు. అదేవిధముగనే సాత్త్విక గుణములతో చేరిన మానవుని హృదయమనే దొడ్డిలో దుర్మార్గమైన గుణములు జొరబడినప్పుడు సద్గుణములు ఏమైపోతవి? కనుక ఈ పవిత్రమైన మానవుని హృదయమునందు, నిర్మల, నిశ్చల, నిస్స్వార్థమైన మానవుని మనస్సునందు, దివ్యమైన గుణములు కలిగిన చిత్తమందు ఈ దుర్గుణములైన క్రూరమృగములు ప్రవేశించడం చేత మానవత్వమును కోల్పోయి మృగత్వమును అభివృద్ధి పరుచుకోడానికి అవకాశం ఏర్పడుతూవచ్చింది. కనుకనే ఈ భక్తి ప్రపత్తులనేవి ఎటువంటివి? ఏ నిమిత్తమై మనకు ఏర్పడినటువంటివి? అనే సత్యాన్ని ఇప్పుడు గుర్తించుకోవడం అత్యవసరం?

భక్తి అనగా కేవలము జప భజనాదులతో మాత్రమే కాక, ధ్యాననిష్ఠాదులతో మాత్రమే కాక, అనుష్ఠాన ఆచరణలతోనే కాకుండా, మనలో ఉన్న మృగతత్త్వాన్ని దూరము గావించుకునే నిమిత్తమై ఈ యొక్క భక్తిమార్గములో ప్రవేశించాలి. ఏతావాతా భక్తియొక్క అంతరార్థమేమనగా : మానవుని యందు ప్రవేశించిన పశుత్వాన్ని దూరం గావించుకుని, పశుపతి తత్త్వాన్ని ప్రకాశింప చేసుకోవడమే భక్తి. దివ్యత్వాన్ని ఏనాడు అభివృద్ధి గావించుకొందుమో, ఆనాడే మానవత్వమనే పేరు సార్థక మవుతుంది.

కనుక ఇట్టి మానవత్వము, దివ్యత్వము, పశుత్వము జీవతత్త్వము లందు విభాగములు గావించే నిమిత్తమై, జననమరణాదులు లేని శక్తి, మాయకు అతీతమైన శక్తి, లీలామానుష విగ్రహమైన పురుషశక్తి, పురుషోత్తమ శక్తి, మానవత్వంగా లోకానికి దిగి రావటం ఏర్పడుతూ వచ్చింది. ఆదే గోపాల తత్త్వము అన్నారు. గోపాలుడనగా గోవులను పాలించువాడు అని సామాన్యమైన అర్థము. గో వనగా జీవులని అర్థము. గోపాలుడు అనగా జీవులను పాలించుటకు దిగివచ్చిన నరాకారతత్త్వమే ఈ కృష్ణాష్టమి యొక్క అంతరార్థము.

నిర్గుణ నిరాకార తత్త్వము, ఆకారముతో గుణములతో కూడిన దివ్యత్వంగా రూపొందింప చేసుకున్నట్టి ప్రకాశతత్త్వమే ఈ గోకులాష్టమి యొక్క అంతరార్థము. మానవోత్తములై, పురుషోత్తముడైన శ్రీ కృష్ణతత్త్వమును సార్థకంగావించుకుని, దివ్యత్వమైన ముమ్మూర్తులనుకొలిచేటటువంటి మానవత్వమే ఈ కృష్ణాష్టమి యొక్క అంతరార్థము. తాను ఎట్టి బంధనలచేతకానీ, ఎట్టి భావములచేతకానీ, ఎట్టి మమకార అభిమానముల చేతకానీ, కట్టుబడని వాడననే సత్యాన్ని గుర్తించడమే కృష్ణభక్తులయొక్క నిజమైన పవిత్రత. కృష్ణుడు ఎన్ని చెప్పినా, ఏమి చెప్పినా, ఏమి చేసినా, ఏమి చూపినా, ఏమి పలికినా, అన్నియు మానవోద్ధరణ నిమిత్తమై, ఈ లోకోద్ధరణ నిమిత్తమై, ధర్మోద్ధరణ నిమిత్తమై తాను ఆచరించిన లీలలే. తాను ధర్మమూర్తిగా, అతని దివ్యజీవితమే, అతని ఉపదేశముగా భావించుకొంటూ వచ్చినది ఈ కృష్ణ చరిత్ర. అందుకనే **His life is His Message**. తానుకర్మకాండను స్వయముగా ఆచరించి అనుష్ఠించి అందించినాడు. పవిత్ర కర్మయోగుల ప్రధానమైన స్వరూపుడు కృష్ణుడు. తానునిరంతరము

కర్మను ఆచరిస్తూ, అనుష్ఠిస్తూ ఇతరులకు ఆదర్శ వంతమైన జీవితాన్ని అందిస్తూ వచ్చాడు.

అహంకారమున కేమాత్రము అవకాశము లేక, అసూయ మమకారములకేమాత్రము సందర్భము కలిగించక, తన మానవత్వము యొక్క కర్తవ్యాన్ని నిర్వర్తించుకుంటూ వచ్చిన ఆధర్మాన్ని సామాన్య మానవులకు అందిస్తూవచ్చాడు. తాను చక్రవర్తిగా ఉండినప్పటికినీ, తనకు ఎట్టికార్యముల తోనూ సంబంధము లేకపోయినప్పటికినీ, అర్జునకు రథసారథిగా నిలిచి తాను అనేక కర్మలు ఆచరించి, అహంకారమునకు ఏమాత్రమూ అవకాశము ఇవ్వనటు వంటి సహజ జీవునివలే చేస్తూవచ్చాడు. అంత మాత్రమే కాకుండా, యుద్ధము తదుపరి, గుర్రములను కడగటము, అనేక విధములుగా గాయ ములు తగిలినచోట మందులు పూయటము, ఈ విధమైన కంపౌండరు పని కూడ తానే చేస్తూవచ్చే వాడు. తనకు ఎంత శక్తి సామర్థ్యములు ఉండినప్ప టికినీ, సర్వ సృష్టికూడ తన వాస్తవమునందు ఇముడ్చుకొన్నప్పటికినీ, తాను ఏమాత్రమూ అహం కారమునకు అవకాశము ఇవ్వక, తాను చిన్నకార్యము మొదలు పెద్దకార్యము వరకును స్వయముగా ఆచరిస్తూవచ్చేవాడు. తాను కర్మమార్గమునకు ఒక ప్రత్యేకమైన విశిష్టతను అందిస్తూవచ్చాడు. ఈ విధమైన కర్మను మనము ఆచరించే నిమిత్తమై, మానవుని యందు ఇచ్ఛాశక్తి ప్రప్రథ మముగా అభివృద్ధి పరచుకోవాలి. ఇచ్ఛాశక్తి ఉండి నంత మాత్రమున మన మనోభీష్టము నెరవేరదు. దీనికి జ్ఞానశక్తి కూడ తోడుకావాలి. జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి రెండు కూడ కూడినంత మాత్రమున మన మనోభీష్టము నెరవేరదు. ఇక్కడ క్రియాశక్తి కూడ ఈ మూడింటితో కూడాలి. కనుక ఈ త్రిగుణములు కూడినప్పుడే, త్రిపుటిగా ఏర్పడినప్పుడే త్రికరణశుద్ధి కలిగినప్పుడే మన ఇచ్ఛాశక్తి పూర్ణత్వాన్ని పొందుతుంది.

దీనికొక చిన్న ఉదాహరణము. మనకేదో ఒక విధమైన సంకల్పం కలిగింది. ఇచ్ఛకలిగింది. కాఫీ త్రాగాలనే ఇచ్ఛ కలిగింది. కానీ ఇచ్ఛకలిగినంత మాత్రమున, కాఫీ మన హస్తానికి చేరడంలేదు. ఈ ఇచ్ఛతోనే మనము నిరాశకు గురియైపోతున్నాము. ఇక్కడ జ్ఞానశక్తిని మనం ఉపయోగపెట్టాలి. కాఫీ కావాలనుకున్నప్పుడు దీనికి పాలుకావాలి, చక్కెరకావాలి, కాఫీపొడి కావాలి, స్టౌ కావాలి, నీరు కావాలి, ఇంకా దానికి అనేక విధము లైన ప్రయత్నములు చేసినప్పుడే ఇది కాఫీగా తయారవుతుంది. అని ఈ జ్ఞానశక్తితో ఇచ్ఛా శక్తిని కూర్చాలి ఇవన్నీకలసిఒక జ్ఞానశక్తిగా కూడు తుంది. కానీ, జ్ఞానశక్తి కూడింది. ఇచ్ఛాశక్తి కూడింది. ఈ రెండూ చేరినంత మాత్రమున కాఫీ మన చేతికి వస్తుందా ? ఇక్కడ క్రియాశక్తి చేరాలి. కనుక కాఫీ కావాలనేది ఇచ్ఛాశక్తి, దీనికి ఏమేమి అవసరము అనేటటువంటిది జ్ఞానశక్తి. అన్నిటినీ చేర్చి తయారు చేయడమే క్రియాశక్తి. ఈ మూడు శక్తులు కూడినప్పుడే మన అభీష్టము నెరవేరుతుంది. అదే విధముగానే ఈనాడు మనకు భగవంతుడు కావాలి అని ఆశిస్తున్నాము. అతని సాక్షాత్కారాన్ని పొందాలని ఆశిస్తున్నాము. ఇది ఇచ్ఛాశక్తి. ఈ ఇచ్ఛాశక్తి ఉన్నంతమాత్రాన సాక్షాత్కారము మనకు ఫలిస్తుందని ఏ మాత్రము కూడ మనము విశ్వ సించకూడదు. ఈ ఇచ్ఛ నెరవేరే నిమిత్తమై ఏ మార్గాన్ని అవలంబించాలి ? అనే జ్ఞానశక్తిని కూడ మనం తెలుసుకోవాలి. అంతమాత్రంచేత మనకు ఈ సాక్షాత్కారము ప్రాప్తించడంలేదు. ఈ విధి విధానాన్ని తెలుసుకొని దానిని ఆచరణ యందు ఉంచాలి. నిత్యానుష్ఠానములో దీనిని

ప్రవేశపెట్టినప్పుడే ఈ ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి, క్రియాశక్తి మూడింటిద్వారానే సాక్షాత్కారప్రాప్తి మనకు లభిస్తుంది. కాన ఈనాడు అనేకులు 99% అంతాకూడ కేవలం ఇచ్ఛాశక్తిలోనే కాలాన్ని వ్యర్థం గావిస్తున్నారు. ఈనాడు శుష్కవేదాంతముల చేతనే మనము వాదోపవాదములు జరుపుతూ ఉంటున్నాము. కానీ దానిని ఆచరణయందు గానీ, అనుష్ఠానము సలుపుటయందుగానీ, మనము ఏ మాత్రము కూడ ముందంజ వేయడంలేదు. సిద్ధాంతములను మాత్రమే మనము వల్లెవేయుటకు ప్రయత్నం చేస్తున్నాముగానీ, మనము కూడ ముందంజ వేయడంలేదు. సిద్ధాంతములను మాత్రమే మనము వల్లెవేయుటకు ప్రయత్నం చేస్తున్నాముగానీ, అనుష్ఠానములో కొంతవరకైన ఆచరించుటకు ఏమాత్రమూ పూనుకొనడము లేదు. సిద్ధాంతముల యొక్క ప్రతిపాదనలకంటె అనుష్ఠానాన్ని నిర్వర్తించడము అత్యవసరము, ఈనాడు లక్ష్యములకంటె కూడ మన సాధన అత్యవసరము లక్ష్యప్రాప్తికై మనము ఎంతవరకు ప్రాకులాడుతున్నామో అందులో వెయ్యింట ఒక భాగమైనా సాధనయందు మనం ఉండినప్పుడే ఈ యొక్క లక్ష్యప్రాప్తి మనకు లభిస్తుంది. ప్రతి విద్యార్థి కూడ నేను 1st Class లో పాసుకావాలి అని ఆరాటపడుతుంటాడు. లక్ష్యాన్ని స్మరిస్తూ ఉంటాడు. కానీ ఆశిస్తున్నాడే కానీ ఫస్ట్‌క్లాసు రావడానికి తగిన ప్రయత్నము కృషి తాను సలుపుతున్నాడా ? కనుక తాను ఫస్ట్‌క్లాసు రావాలి అనే ఆశతో వెయ్యింట ఒకభాగము తన సాధన యందు పెట్టినప్పుడు తాను ఫస్ట్‌క్లాసులో గాగలడు అదేవిధముగా ఈనాడు ఆస్తికలోకములో పారమార్థిక మార్గములో పవిత్రమైన భక్తిమార్గములో ఆశలు అమితంగా పెరిగిపోవుచున్నవి గానీ ఆశలకు సంబంధించిన మార్గాన్ని అవలంబించడం లేదు. ఈ యొక్క నిత్యకర్మానుష్ఠాన నిమిత్తమై, కృష్ణ భగవంతుడు అనేక విధములుగా భగవద్గీతయందు మార్గదర్శకంగా నిరూపిస్తూ గీతనే ప్రధానమైన సూత్రంగా ఊతకర్రగా, వెన్నెముకగా ప్రజలకు అందిస్తూవచ్చాడు. అయితే మన జీవితమందు ఇతర ప్రాణులను హింసించుటకు బాధించుటకు, నొప్పించుటకు అనేక విధములుగా ముందంజ వేస్తున్నాము. ఎవరి హృదయము కారుణ్యమయంగా నిలుస్తుందో అట్టివారి హృదయమునందే భక్తిప్రపత్తులనే మొక్కలు అభివృద్ధి అవుతాయి. చవిటి భూమిలో ( Salty Soil ) ఎంత బలమైన విత్తనములు నాటినప్పటికిని, అవి మొక్కలుగా రూపొందవు. అయితే పరులయొక్క బాధలుగానీ, దుఃఖములుగానీ, కష్టములుగానీ మనం గుర్తించవలెనంటే మన హృదయమును పవిత్రమైన అద్దముగా రూపొందింప చేసుకోవాలి. హృదయమును మాలిన్యపరుచుకుని, దుర్గుణములతో నింపుకొని ఇతర బాధలు మనకు కనిపించలేదంటే ఏరీతిగా కనిపించడానికి వీలవుతుంది ? ఏనాడు ఇతరుల బాధలు కష్టములు చింతలు మనము గుర్తింతుమో ఆనాడే మన చింతలను భగవంతుడు గుర్తించడానికి ప్రయత్నిస్తాడు జీవితము కేవలము స్వార్థముతోనే అంతము గావించుకోరాదు. దివ్యమైన సమత్వముతో కూడినటువంటిదే పరార్థము. కాన ఇట్టి దివ్యమైన మార్గములను ప్రబోధించి దివ్యమైన మార్గములలో నడిపించి అనుగ్రహమైన తత్త్వమును తాను ప్రబోధిస్తూ వచ్చాడు కృష్ణుడు. ఇది మన కర్తవ్యం అని నిరూపిస్తూ వచ్చాడు. మనకు ఇందులో ఏ విధమైన ఫలితం లేకపోయినప్పటికిని, మనం కర్మనాచరించే నిమిత్తమై ఈ కాయము జన్మించినదని, ఈ కాయమును సార్థకం గావించుకునే నిమిత్తమై కాలముకూడ ప్రాప్తించినదని, ఈ మూటియొక్క ముమ్మొచ్చటనూ నిరూపిస్తూవచ్చాడు కృష్ణుడు.

కృష్ణతత్త్వము నిరంతరము లీలామానుష విగ్రహమే. అనగా పరులను ఆనందపెట్టడము, తాను ఆనందించడము, పరులను నవ్వించడము తాను నవ్వడము, పరులను గౌరవించడము తాను గౌరవింపబడటము, ఈనాడు లోకములో అందరూ తనను గౌరవించాలి గానీ, ఇతరులను తాను గౌరవించడానికి పూనుకోడు. తాను ఆనందించాలి కానీ ఇతరుల ఆనందం చూసి ఓర్చుకోలేడు. మానవుడు తన సుఖమును మాత్రమే లక్ష్యమునందుంచుకొనును కానీ ఇతరుల సుఖమును ఏమాత్రమూ లక్ష్యమునందుంచుకొనుటలేదు.

ఈ మార్గములందు స్వార్థపర సుఖమార్గము, స్వార్థపరార్థపర సుఖమార్గము, పరార్థసుఖమార్గమని మూడు మార్గములున్నవి ఈనాడు కేవలము స్వార్థసుఖమార్గమే అధికంగా కనిపిస్తున్నది. స్వార్థ సుఖమార్గము అంటే కేవలము ఒక కాకివంటిది. తన సుఖమే, తన ఆనందమే, తన పొట్టనింపుకోవడమే తాను చూస్తుంది. స్వార్థపరార్థ సుఖమార్గమనగా తాను సుఖించాలి, పరులను సుఖపెట్టాలి అనే మధ్యే మార్గము. పరార్థసుఖమార్గమనగా తాను ఏవిధమైన బాధలకు గురియైనప్పటికినీ, ఇతరులను సుఖపెట్టాలి. ఇతరులను బాగుపరచాలి, ఇతరులు ఆనందించాలి అనే దివ్యమైన మార్గములో ప్రవేశపెట్టడం. ఈ మూడు కూడ మూడు విధములైన జ్యోతులవంటివి. స్వార్థసుఖమార్గమనగా మన రూమ్‌లో మనం తగిలించుకున్న దీపము వంటిది. అనగా రూమునందున్న జ్యోతి ఆ రూముకు మాత్రమే చేరుతుంది తప్ప మరి బయట ప్రదేశములకు ప్రసరించదు. స్వార్థపరార్థ సుఖమార్గమనేటువంటిది మూన్‌లైట్ వంటిది. చంద్రుని యొక్క వెలుతురువంటిది. సర్వత్రా ఈ వెలుతురున్నది. కానీ సుస్పష్టంగా మనకు గోచరించడం లేదు. వస్తువుల యొక్క యథార్థస్వరూపాన్ని గుర్తించటానికి వీలుకానిదిగా ఉంటుంది. ఇంకా పరార్థ మార్గమనేది సూర్యుని యొక్క కాంతి వంటిది. ఈ సూర్యకాంతి లోపల, వెలుపల అందరికి కూడ ప్రకాశాన్ని అందిస్తుంది కనుకనే పరార్థ మార్గాన్ని సమర్థమైన దివ్యత్వము అన్నారు.

మూన్‌లైట్‌ను అన్యోన్యమైన సమంజస శక్తి అన్నారు. ఇంక స్వార్థమార్గము కేవలము అసత్యమైనది. మానవత్వాన్ని కూడ నిర్మూలము గావించేటువంటిది, కుత్సితమైనటువంటిది. కేవలము సంకుచితమైనది. ఇంటిలో తన గదిలో తాను పెట్టుకున్న దీపము వంటిదిగా ఉంటుంది. కనుక భగవద్గీత కానీ కృష్ణుని ప్రబోధలు కానీ ఇలాంటి పవిత్రమైన పరార్థ సుఖమార్గాన్ని లేక సమర్థ మార్గాన్ని అందించినవే.

కేవలము కృష్ణ జన్మోత్సవమని మనం ఉత్సవాలు చేసుకుంటూ పూజలు గావించుకుంటూ ఈ కృష్ణ జన్మాష్టమి కోసం అనేక విధలుగా వైభవాలు జరుపుకోవడం చేతనే కృష్ణ జన్మాష్టమి యొక్క రహస్యాన్ని మనం గుర్తించుకోలేము. కానీ ఈనాడు కృష్ణుని మాత్రమే ఆశిస్తున్నాము కానీ కృష్ణుని ఆదేశాలను ఆశించడం లేదు. అనుష్ఠించడం లేదు. కృష్ణుడు కానీ కృష్ణుడి వచనం కానీ వేరు వేరైనవి కావు. కనుక కృష్ణునికి కృష్ణుని వచనములకు ఏ మాత్రమూ విరుద్ధములేదు. కావు. ఎవరు కృష్ణుని మాత్రమే ఆశించి కృష్ణ వచనాన్ని దూరం చేస్తారో వారు కృష్ణ ద్రోహులు అనే చెప్పవచ్చును. కనుక మనం కృష్ణుని ప్రేమించకపోయినప్పటికినీ కృష్ణ వాక్యములను అనుష్ఠానంలో పెట్టుకోవడం చేత అవియే మనకు దివ్యదీపములుగా వెలగొందుతూ ఉంటాయి. దివ్యమార్గాన్ని నిరూపిస్తాయి. పవిత్రమైన సన్నిధిని చేరుస్తాయి. దైవ సన్నిధిలో దింపుతాయి. కనుక ఈ ప్రేమ తత్త్వాన్ని మనం ఈనాడు అభివృద్ధి గావించుకోవాలి. కృష్ణుడు ప్రేమ స్వరూ

పుడు. ఆతని ప్రేమ పెరిగి, కరిగి ప్రవహించడం చేతనే కరుణామయుడుగా రూపొందాడు. కనుక ఈ కృష్ణ ప్రేమను ఈనాడు మనం నిజమైన తృష్ణగా భావించుకోవాలి. మానవునికి ఉండవలసిన తృష్ణ కృష్ణప్రేమయే. ఈ ప్రేమలో ఏమాత్రము కూడ స్వార్థమన్నది ఉండదు. సర్వులయందున్న ప్రేమ తత్త్వమే కృష్ణుడు. సర్వులయందు కూడ మనం కరుణను ప్రసరింప చేసినప్పుడే అదితపస్సు. కానీ ఈ ప్రేమ తత్త్వముచేత మనం తాపమును పొందినతే, అది తపస్సుగా మారుతుంది. తపస్సనగా కేవలం అరణ్యములకు వెళ్ళి ముక్కు మూసుకుని డొక్కలు కొట్టుకుంటూ ఆకులములు మేసి ఆహార విసర్జనచేసి అనేక విధముల పరితపించి అనారోగ్యానికి గురికావడమే తపస్సయిపోదు. కృష్ణ ప్రేమ కోసమై తాపమును పొందటమే నిజమైన తపస్సు. ఈ విధమైన ప్రేమతత్త్వాన్ని దినదినమూ మనం అభివృద్ధి గావించుకుంటూ దైవత్వములో జీవత్వాన్ని అంకితం గావించుకోవడమే నిజమైన పరమ భక్తి యొక్క లక్షణం : దివ్యాత్మ స్వరూపులారా !

మనము అనేక విధములుగా సాధనలు సలుపుతున్నాము. ఈ సాధనలయందున్న అంతరార్థమేమో గుర్తించుకోలేక పోతున్నాము. ఎన్ని సాధనలు చేసినప్పటికినీ దివ్యమైన ప్రేమలో అవి అంకితమయ్యేవే. అనేక పర్యాయములు చెప్పాను 'ఆధ్యాత్మిక విద్యా విద్యానాం' అని, కనుక మన సర్వ సాధనలు కూడ ఏదో చిన్న చిన్న నదులవంటివిగా ప్రవహిస్తూ వస్తున్నాయి. భగవంతుని ప్రేమ అనే సముద్రములో ఇవన్నీ చేరిపోయేటటు వంటివే. నదీనాం సాగరోగతిః అని. అన్ని నదులు కూడ సాగరములో లీనమైనట్లుగా అన్ని మార్గములు కూడ భగవంతుని ప్రేమ తత్త్వములోనే లీనమై పోతుంటాయి. కనుక ఈ ప్రేమను సర్వులయందున్న ఆత్మ ప్రేమగా మనం భావించి అందరినీ మనం ప్రేమించడానికి ప్రయత్నించాలి.

శ్రీవారి దివ్యోపదేశము
కృష్ణాష్టమి 14-8-79
ప్రశాంతి నిలయము.



# "ఏకం సత్"

పక్వఫలము వృక్షమునుండి పడిన భంగి
జ్ఞాని కడతేరు కర్మశేషంబు వీడి
సంచి తానికి వడ్డిని పెంచుకొనుచు
పాపి వర్ధిల్లు దినదిన ప్రాభవమున.
భారతవర్ష జంతువుల భాగ్యమదేమని చెప్పవచ్చు నీ
భారత దేశమందు ప్రభవంబయి శ్రీహరి
జీవకోటికిన్, ధారణ యోగ్య విద్యల సదా
వివరించుచుండె.

పవిత్రాత్మ స్వరూపులారా !

జగత్తు బ్రహ్మాండము. జీవుడు పిండాండము. ఈ రెండింటియందున్న మూల సత్యం ఒక్కటియే. ఈ మూల సత్యము దేనితోనూ సంబంధము లేకుండా ఉన్నది ఈ స్థితినే బ్రహ్మమని పిలువవచ్చు. ఈ బ్రహ్మ, జగత్సంబంధమైన వ్యవహారములలో పూనుకొన్నప్పుడు దీనినే పరమాత్మ అని పిలువబడుతుంది.

జగత్తుకు ఆధారమైన సత్యము ఆత్మ. మానవునికి ఆధారమైన సత్యము కూడ ఆత్మయే.

ఈ ఆత్మ భిన్నముగా తోచునంతవరకు దీనిని మిథ్య అని చెప్పబడుచు వచ్చింది. మిథ్య అనగా విచారణ జరుపనంతవరకు సత్యముగానే గోచరిస్తుంది జగత్తు. విచారణ జరిపిన తరువాత ఇది అసత్యము అని తెలుస్తుంది. అనగా సత్య అసత్యములకు రెండింటి యొక్క సమ్మిళితమైన స్వరూపమే మిథ్యాతత్త్వము. అనగా సద సత్తులతో కూడిన జగత్తుకు మిథ్య అనిపేరు. ఈ మిథ్య మాయాజనితము, ఆకాశము నందు మేఘములు కనిపించునట్లుగా బ్రహ్మమందు ఈమాయ కనిపించుతూ ఉంటుంది. జగత్తు ఉన్నటు వంటి సత్యము. దీనియొక్క ప్రభావము అనేక రూపములుగా ప్రకటిస్తూ ఉంటుంది. ఈ పరమ తత్త్వానికి సత్ చిత్, ఆనందమని వేరు పేర్లుగా రూపొందుతూ వచ్చింది. ఈ మూడు కూడ ప్రత్యేక మైనవి కావు. ఈ మూడును ఒక్కటియే.

ఆవిధముగనే దైవశక్తియొక్క మాయకూడ సత్త్వరజస్తమోగుణస్వరూపములను ధరిస్తూ ఉంటుంది. ఇది జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి అనే స్వరూపాన్ని ధరిస్తూ ఉంటుంది. సత్త్వగుణమునే జ్ఞానశక్తిగా రూపొందింప చేస్తున్నాము. రజోగుణమునే ఇచ్ఛాశక్తిగా భ్రమిస్తున్నాము తమోగుణమునే క్రియాశక్తిగా భావిస్తున్నాము. ఆత్మ ఏకము, అనంతము. మాయ శుద్ధమైన అద్దమువంటిది. ఎదుటి వస్తువును తనలో ప్రతిబింబింప చేసికొనేశక్తి మాయ యందు కలదు. మాయ రజోగుణ ప్రాధాన్యమును ధరించినప్పుడు అవిద్యగా రూపొందుతుంది. శుద్ధ సత్త్వప్రధానముతో కూడిన మాయ యందు ప్రతి బింబించిన ఆత్మ, ఈశ్వరుడు. రజోగుణ ప్రాధాన్య మును అనుసరించి అవిద్యయందు ప్రతిబింబించే ఆత్మ జీవుడు. తమస్సునందు ప్రతిబింబించేటటువంటి ఆత్మ, పదార్థము. ఇది కేవలము ఉపాధి భేదములను పురస్కరించుకొని భిన్న భిన్న రూపములుగా మనకు కనిపించుచున్నదేకానీ, ఆత్మ ఒక్కటియే. ఇందులో ప్రతిబింబింప చేసే తత్త్వము ఆత్మ; మాయకాదు.

ఇందులో అనేకవిధములుగా కనిపించే మాయా తత్త్వము కేవలము ఆత్మయొక్క బింబ ప్రతి బింబ తత్త్వము, రెండింటి యందున్న మూలతత్త్వము ఒక్కటే అని గుర్తించాలి. ఇక్కడ ఆత్మతత్త్వము సర్వత్రావ్యాపించి సర్వ పదార్థములయందును సర్వ జీవులయందుకూడ ఏకత్వమై నిరూపించే దివ్య తత్త్వమే. ప్రకృతి, ఈశ్వర, జీవ, మాయాతత్త్వముల యొక్క పరిణామమే.

ఇక్కడ మరొక విషయాన్ని మనం విచారించాలి. మాయ అన్నది అద్దమువంటిదని మనం తెలిసికొన్నాం. ఈ అద్దము ఎదుటి వస్తువును ప్రతిబింబింప చేసి కొంటున్నది. అద్దముయొక్క మాలిన్యముతోగానీ, వికృతితోగానీ, ఈ ప్రతిబింబమునకు ఏమాత్రము సంబంధముండదు. గుణము ఈశ్వర జీవ ప్రకృతి యొక్క వికారములు కేవలము ఈ అద్దముయొక్క గుణములేకానీ దివ్యతత్త్వగుణములు కావు. ఇది కేవలము [illegible] పెరుగుగా మారినట్లుగానే ఇది సర్వము మాయ యొక్క కల్పితమేగానీ, ఆని వికారములేకానీ ఆత్మ యొక్క వికారములు కావు. సమస్త సృష్టికూడ దైవమునుండి ఆవిర్భవించుతూ వచ్చింది. కనుక దైవమునుండి ఆవిర్భవించిన సృష్టియందు, దైవము ఆశించునట్టి పదార్థము మరొక్కటికూడ లేదు. కనుకనే దైవమునకు ఆశయనిగానీ, తాను ఆశించే పదార్థము కాని జగత్తునందు ఉన్నదని భావించరాదు. "నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన" అనగా సృష్టి అనేది దైవముయొక్క సహజము తాను లీలా వినోదుడు. కర్మఫలమును అందించేవాడు కనుక అతనికి కర్మఫల ప్రదాత అను పేరు. కనుక

ఈశ్వరునకుకానీ, జీవునకుకానీ, ప్రకృతికికానీ, కర్మకు కానీ, అవిద్యకుగానీ అది తెలిసికోవడము వీలుకాదు

ఐతే దీనికి ఆది తెలియదుకానీ అంతము ఉన్నది ఎప్పుడు అంతము ? మనము ఈ మాయనుండి దూర మైనపుడే అంతమని మనము భావిస్తున్నాము నిజముగా ప్రకృతియే లేకుండిన జీవుడే లేడు. జీవుడే లేకుండిన దైవమే లేడు. కొడుకు లేనప్పుడు తండ్రి అనబడే పదము అర్థహీనము. అదేవిధముగానే ఇక్కడ ఆకాశము ఒక్కటే. దీనిని ఘటాకాశము, మఠాకాశము, పటాకాశము అని అనేక విధములుగా రూపొందించుకొంటున్నాము. అనగా పాత్రలో కని పించే సమయమునందు ఘటాకాశమంటున్నాము. ఇంటిపైన కనిపించేసమయమునందు మఠాకాశమంటు న్నాము. పటమునందు కనిపించే సమయమునందు పటాకాశమంటున్నాము. ఈ ఘట, మఠ, పటము లన్నియును కేవలము ఉపాధి యొక్క భేదములేకానీ స్వచ్ఛమైన, నిత్యమైన ఆకాశము ఒక్కటియే. ఈ ఘట, మఠ, పటములయొక్క ఆకారవికారములు ప్రత్యేకముగా ఉండినప్పటికీ, ఆకాశము వికారమునకు ఏమాత్రము సంబంధము లేనటువంటిదిగా ఉంటుంది. కనుక మానవునియందున్న ఆకారవికారములు భిన్న ములుగా ఉన్నప్పటికినీ ఇందులో ప్రతిబింబించే ఆత్మ తత్త్వము దివ్యత్వమై, ఏకంగానే, అఖండంగానే ఉంటుంది.

లోకమునందు అనేక మానవులు ఈ సృష్టికి కారణము ఏమిటి ? ఈ సృష్టి ఎట్లు కలుగుచున్నది ? అనే ఊహాపోహలతో అల్లాడి పోతున్నారు. దీనికి ఒక్కటే ఒక్కటి జవాబు. మనం కలలు కనుటకు ఏది కారణము ? కలలకు కారణము నిద్రయే. నిద్రా శక్తియే కలలకు కారణమైనట్లుగా, సృష్టికి మాయా శక్తియే కారణము. కలలో కనిపించే దృశ్యము లన్నింటికినీ ఒక నియతి, ఒక క్రమము అనేది ఏ మాత్రమూ కనిపించదు. అదేవిధముగ సృ యందు సృష్టింపబడే ప్రతి విషయమునకు క ఏ విధమైన క్రమముగానీ, నియతిగానీ ఉండ ఈ సృష్టి ఏ రీతిగా జరుగుచున్నది అనే ప్రశ్న మనం మునిగి కాలమును వ్యర్థంగావించుటకంటె సృష్టిని [illegible] అత్యావసరము.

ఈ ప్రపంచము ఎట్లు పుట్టినది ? ఎట్లుగిట్టును ! అనే విచారణ కేవలము కాలహరణము ఈ ప్రపంచ నందు, సృష్టియందు, సృష్టింపబడినటువంటి నీగతి ఏమిటో, మొట్టమొదట నీవు తెలిసికోవాలి. ఈ జగత్తునందు పుట్టిన నీవు ఏవిధమైన స్థితి గతుల అనుభవిస్తున్నావో. ఈ సత్యాన్ని గుర్తించడ అత్యవసరము. జీవుడు రజోగుణసంబంధుడ అతనికి ఊర్ధ్వస్థానమునందు సాత్త్వికమున్నది అతనికి అధస్థానమునందు తామసికమున్నది మధ్యస్థానము నందున్నటువంటివాడే జీవుడు సాత్త్వి ప్రతిబింబమైనటువంటి ఈ ఈశ్వరుడు ఊర్ధ్వస్థానమ నందున్నాడు. కనుక పదార్థస్థానమును పొందినది తమోగుణము. కనుక ఈ మధ్య స్థానమునందున్న మానవుడు అధోగతికి పోవుటకు ప్రయత్నించక ఊర్ధ్వగతిని కొంతవరకు ప్రయత్నపూర్వకంగా సాధించడానికి పూనుకోవాలి. ఇట్టి ఏకాత్మతత్వాన్ని ప్రబోధించేదే గురుస్థానము. ఇట్టి సత్యాన్ని గుర్తించి పవిత్రమైన మూలాధారమును తెలిసికొని తనయొక్క మానవత్వములోనున్న దివ్యత్వమేమిటో తాను విచారించాలి.

'ఆధ్యాత్మికము' 'ఆధ్యాత్మికమని' పదముల ప్రయోగపెడుతుంటాము. ఆధ్యాత్మికమనగా ఏమిటి ? భజనలు చేయడమా లేక జపములు చేయడమా, లేక [illegible]

ఆచరించడమూ, లేక పుణ్యక్షేత్రములకు పోవడమూ, కాదు కాదు. ఇవి కేవలము సత్కర్మలని చెప్ప వచ్చును. ఆధ్యాత్మికముగా మానవుని యందున్న పశుత్వాన్ని జయించడమే. అంతియే కాదు, మానవత్వంనుంచి దివ్యత్వానికి చేరిపోవడమే ఆధ్యాత్మికము.

కానీ ఈనాడు ఆధ్యాత్మికమనే ముసుగును మనం ధరించి అనేక యాత్రలు సత్కర్మలు ఆచరిస్తున్నాము. కానీ ఇందులో దాని ఫలితమైన మృగత్వాన్ని, పశుత్వాన్ని మనం జయించుచున్నామా ? అనే సత్యాన్ని మనం విచారించాలి అనేక వేదశాస్త్ర ఇతిహాస పురాణములను పఠిస్తున్నాము. అనేక పుణ్యక్షేత్రములు యాత్రలుగా తిరుగుతున్నాము. అనేక తీర్థములందు మునుగుతున్నాము. అనేక మహనీయులను దర్శిస్తున్నాము. కానీ మనలో నున్న పశుత్వం ఎంత వరకు మనము జయిస్తున్నాము ? ఈ విచారణయందు మానవుడు ఏమాత్రమూ ప్రయత్నపూర్వకంగా విచారించుటలేదు ఈ సత్యాన్ని విచారించక ఎన్ని సాధనలు చేసినప్పటికినీ ఇవి కేవలము నిరుపయోగమైనటువంటివనే సత్యాన్ని ఈనాడు మనం గుర్తించాలి. ఎన్ని సంవత్సరములు జరిగినప్పటికినీ, ఎన్ని విధములైన సాధనలు చేసినప్పటికినీ మనలో ఉన్నటువంటి పశుత్వము దినదినము అభివృద్ధినందుచున్నదేకానీ దానిని వశం చేసుకొనుటకు ఏమాత్రమూ పూనుకొనుటలేదు. దురాశ, అహంకారము, అసూయ, ఇలాంటి దుర్గుణములైన పశులక్షణం మనము ఇంకనూ బలపరచుకొనుచూ పోతున్నాము. ఇక మన ఆధ్యాత్మికము ఏ విధంగా అభివృద్ధి అవుతున్నది? మనము ఇన్నిక్షేత్రయాత్రలు చేసి ఇక ప్రయోజనమేమిటి ? దైవము చెంతకు వెళ్ళికూడ ధనమునే ఆశిస్తున్నారు. కానీ దయను ప్రేమనూ ఆశించడం లేదు.

అదృశ్యమైన అశాశ్వతమైన జగత్సంబంధమైన ఈ పదార్థముల విలువయందే మనము జీవితమును అంకితము చేస్తున్నాము. ఇది తమోగుణ ప్రాధాన్యమును అనుసరించిన జగత్తని మనం గుర్తించుకోలేక పోతున్నాము. జీవతత్త్వమునే ఊర్ధ్వగతికి ప్రయాణము సలుపపలసినటువంటి మార్గమని మనం గుర్తించుకోలేక పోతున్నాము. ఎంతకాలము ఈ తమోగుణ సంబంధమైన ప్రకృతియందు జీవించినప్పటికినీ, మనం సాత్త్వికమైనదాన్ని సాధించుకోలేక పోతున్నాము. కనుక ఇట్టి ఏకాత్మతత్త్వాన్ని, సత్యాన్ని ప్రబోధింపచేసే గురువే సరియైన గురువు.

ఇక్కడ గురువులు అనేక విధములుగా ఉంటున్నారు. ఒక మంత్రమును తెలిపి ఆ మంత్రార్థమును బోధించి దానిని నిష్ఠతో సాధించమని చెప్పడము; ఇతనిని దీక్షా గురువు అంటారు. దీక్షా గురువు కేవలము మంత్రమును మాత్రమే ఉపదేశించడము తనయొక్క కర్తవ్యము. ఈ దేహమనే యంత్రమందున్న ఇంద్రియాలను అరికట్టుకోలేనటువంటి మంత్రశక్తి ప్రయోజనము లేదు. కేవలము ఈ మంత్రములన్నియు కొన్ని గ్రామ ఫోనుప్లేట్లవలె, టేప్‌రికార్డులవలె ఉచ్చరించవచ్చునేతప్ప మంత్రముయొక్క శక్తిని గుర్తించుకోవచ్చునే తప్ప ఆచరణ శూన్యమై ఉంటవి. ఇక రెండవ మార్గము అనేక దేవతలను ఆరాధింపచేసే విధి విధానాన్ని గుర్తింపచేసే గురువు. ఇతను శాసన గురువు. ఇతనినే బోధగురువని కూడ పిలువవచ్చును. ఈ బోధ కేవలము తలవరకు చేరవచ్చునే కానీ హృదయానికి చేర్చుటకు వీలులేదు. ఈ బోధలయందు అనేకత్వమే అభివృద్ధి గావించుచున్నది కానీ ఏకత్వము గుర్తించే పరిస్థితి పోతున్నది. ఈశ్వరుడువేరు, జీవుడువేరు, ప్రకృతివేరు అనే ద్వైతమార్గముకంటే అతీతమైన మార్గాన్ని అవలంబిస్తుంది. ఈ ఈశ్వరుడు

జీవుడు, ప్రకృతి మూడుకూడా పదార్థముల ప్రతిబింబములే తప్ప యథార్థమైన ఆత్మ ఒక్కటే అనే సత్యాన్ని గుర్తింపచేసేది ఈ బోధగురువుల యందు కనిపించదు. కానీ సత్యమనేదాన్ని మనం గుర్తించుకునేంత వరకు అనేకత్వములో జీవించక తప్పదు. అనేకత్వము ఉండినంతవరకును ఏకత్వము మనకు ప్రాప్తించదు.

ఈనాడు ప్రతిపాదకుడు కానీ జ్ఞానిఅని పిలువబడే పండితుడు కానీ ఇంకేవిధములైన గురువులు కానీ, ఈ సత్యాన్ని వారు గుర్తించుకొనలేక కేవలము జగత్సంబంధమైన వ్యవహారములందు మాత్రమే, ప్రతిబింబాలను ప్రబోధిస్తూ వస్తున్నారు. కన్ను ఉండినంతవరకు కన్ను యొక్క విలువ మానవునకు గుర్తురాదు. కన్నులు పోయినప్పుడు కన్నులయొక్క విలువ తాను గుర్తించుకోగలడు, అర్థం చేసికోగలడు అదేవిధముగ ప్రతి అంగము కూడ ప్రతి పదార్థము కూడ ఉండినంతవరకు దానియొక్క విలువను తెలిసికొనలేము. దానిని మరచినప్పుడే దానియొక్క విలువను తెలిసికోడానికి వీలవుతుంది. ఈ జగత్సంబంధమైన విషయములన్ని కూడ మనదృష్టి యందున్నంతవరకును జగత్సంబంధమైన విలువకూడ మనకు అర్థం కాదు. ఈ జగత్తంతయు దేనినుండి ఆవిర్భవించుచున్నది ? అని ఆధారమైన మూల సత్యాన్ని మనం గుర్తించుకొన్నప్పుడే ఈ జగత్తంతయు ఏకత్వంగా రూపొందుతుంది. కనుక ఈనాడు మనము చేయునటువంటి సర్వకర్మలు కూడ అజ్ఞాన ప్రతిబింబములేతప్ప జ్ఞానమునకు సంబంధించినవికావు.

అయితే ఈ అజ్ఞానము పోయే విధానము ఏమిటి ? అని మనము కాలమును వ్యర్థం చేసికొనుటకంటే ఈ అజ్ఞానము పోయే విధానము గుర్తించుటకంటే, అజ్ఞానమునే చింతించకుండా జ్ఞానస్వరూపమైన దైవాన్ని చింతించడం అత్యవసరం. విచారణాశక్తి జ్యోతి వంటిది. విచారణా రాహిత్యమనేది అంధకారము వంటిది. ఏనాడు ఈ జ్యోతి వెలుగునో ఆనాడే ఈ అంధకారము దూరమవుతుంది. ఏనాడు ఏకత్వము సత్యము అనే ఆత్మతత్త్వాన్ని గుర్తించుకొందుమో ఆనాడే మన అజ్ఞానం నిర్మూలం అవుతుంది. పాత్రలో కనిపించునంతవరకు చలించే చంద్రుని మనం సత్యంగా భావిస్తున్నాము ఈ ప్రతిబింబమైన పాత్రలో నున్న చంద్రుని చూచుటకంటే పైచంద్రుని చూచుటకు మనం ప్రయత్నించినప్పుడు అది నిరంతరము అచలమై స్థిరముగా ప్రకాశవంతమైనదిగా ఉంటుంది

కనుక ఒక్క దేహమునందున్న ఆత్మనేకాక సర్వ దేహములలో ఉన్న ఆత్మ ప్రతిబింబాన్ని గుర్తించుకోవడమే కాకుండా అన్నిటికీ అతీతమైన మూలాధారమైన బ్రహ్మతత్త్వాన్ని మనం గుర్తించాలి. ఈ బ్రహ్మతత్త్వమే దేనితో కూడ సంబంధము లేనటువంటిదిగా ఉంటుంది. అనగా ఏ పదార్థమూ లేనటువంటి పరిస్థితిలో ఉండటం చేతనే దేనితోనూ దానికి సంబంధముండదు. ఒకవిధమైన పదార్థము, ఒక విధమైన జీవతత్త్వము రెండూ ఉండినప్పుడే ఇది అందులో సంబంధము కలిగియున్నది. కేవలము జీవుడుకానీ, పదార్థముకానీ బ్రహ్మకంటే వేరుకావనే సత్యాన్ని గుర్తించినప్పుడు ఇంకా అతనికి దేనితో సంబంధముంటుంది ? దీనిని పురస్కరించుకొనియే శ్రుతులయందు "ఏకంసత్, విప్రాఃబహుధావదంతి" యన్నారు. ఉన్నది ఒక్కటే ఐనప్పటికినీ ఈ రజోగుణమునందు ప్రతిబింబించే దీనిని జీవుడుగా భావిస్తూ వచ్చారు పండితులు. కొంతమంది తమోగుణమనే దానిలో ప్రతిబింబింపచేసే బ్రహ్మతత్త్వాన్ని తాము పదార్థము అని ద్వైతంగా రూపొందింప చేస్తూ వచ్చారు. కానీ, మరే ఉన్నత స్థాయిలో ఉన్న వారు సత్త్వగుణములో ప్రతిబింబించే ఆత్మతత్త్వాన్ని

ఈశ్వరుడు అని నిరూపిస్తువచ్చారు. అయితే ఈ ఈశ్వరత్వముగానీ జీవతత్త్వముకానీ, పదార్థము యొక్క తత్త్వముకానీ మూడు కూడ ప్రతిబింబములే కాని సాక్షాత్ స్వరూపములు కావు.

ఇవి మాయయొక్క వికారములు. మాయ ప్రత్యేకించిన పదార్థము కాదు. కేవలము బ్రహ్మముయొక్క నీడ యనే చెప్పవచ్చును. కనుక ఇట్టి మాయా తత్త్వమును మనము సాధించుకోవడముకూడ అసాధ్యమైనటువంటిది. ఈశ్వర తత్త్వాన్ని మనం గుర్తించుకొన్నప్పుడు లేక బ్రహ్మతత్త్వాన్ని మనం అర్థం చేసికొన్నప్పుడు మాయ అనేది మనకు అగోచరమైపోతుంది. మాయా గుణములు ఉండినంతవరకు మాత్రమే మనకు ప్రకటిస్తుంది. సాత్త్వికముకానీ, రాజసికముగానీ, తామసికముకానీ మానవునియందు ఎంతవరకు వ్యవహారరూపములో ఉంటుందో. అంతవరకు మనకు ఈ విధమైన మాయ తప్పనదికాదు. ఏనాడు ఈ గుణములకు అతీతమవుదుమో ఆనాడే ఈ మాయాతత్త్వము నుంచి దూరము కాగలము.

కనుకనే భగవద్గీతయందు మోక్షమునుకూడ సన్న్యసించమన్నాడు. సర్వగుణములుకూడ త్యాగము చేసినప్పుడే ఈ బ్రహ్మతత్త్వముయొక్క ఆధారభూతమైన ఆత్మ గుర్తించడానికి వీలవుతుంది. మోక్షమనగా మోహమును త్యజించాలి అని చెప్పారు. ఈ మోహము అనేది అభిమాన మమకారములతో కూడి ఉంటుంది. మీకు, అనేకులకు తెలిసి ఉండవచ్చును. ద్వారకా వాసులు యాదవులు. యాదవులందరూ కృష్ణుని తమవాడుగా భావిస్తూవచ్చారు. మా మేనమామ, మా కుమారుడు, మా అల్లుడు, మా అన్న, ఈవిధమైన బంధుత్వంగా వారు వ్యవహరిస్తూ వచ్చారు. కృష్ణుడు మావాడు మావాడు అని అనుకోవడము ఒక విధమైన అభిమానము. ఈ అభిమానము ముదిరేటప్పటికి మమకారము పెరిగింది. ఈ అభిమాన, మమకారములు కూడేటప్పటికి అహంకారము ప్రారంభమైంది. ఈ అభిమాన మమకార అహంకారములు మూడూ కూడేటప్పటికి మోహంగా రూపొందింది. ఈ మోహముతో తాము మనవాడు మనకృష్ణుడు అని అనుకున్నవారి గతి కట్ట కడపటికి ఏమయింది? యాదవులలో యాదవులు తమకు తామే కొట్టుకొని జీవితములు చాలించుకున్నారు. ఘోరకృత్యానికి పాల్పడ్డారు. క్రూరమైన భావాలతో సమసిపోయారు. కనుక ఈ అభిమాన, మమకార, అహంకారముల యొక్క తత్త్వము ఈ విధంగా మానవత్వాన్ని నిర్మూలనముగావిస్తూ వచ్చింది.

గోకులములో నున్న గోపికలు మేము నీ వారము. కృష్ణా! మేము నీవారము అన్నారు. ద్వారకావాసులకు గోకులవాసులకు ఉన్నటువంటి వ్యత్యాసము ఇదే. ద్వారకావాసులు కృష్ణా! నీవు మావాడవు అన్నారు. గోపికలు మేము నీవారము అన్నారు. మేము నీవారము అనేది శరణాగతికి లక్షణము. నీయిష్టము, నీవేమైనా చేసికోవచ్చు, నీవారము అనేతత్త్వము ప్రతిబింబము యొక్క లక్షణము. కనుకనే వీరిని వదలి మధురకేగిన కృష్ణుడు వీరి యోగక్షేమములు విచారించుటకు ఉద్ధవుని పంపటము, వీరియొక్క కష్ట నష్టములను సరిచేయటము జరుగుతూ వచ్చింది. ఇక్కడ మావాడు అనే తత్త్వము, అభిమాన మమకారములతో కూడినటువంటి తత్త్వము. మోహము మనలను బంధింప చేస్తున్నది. కనుక ఈ మోహమే మన బంధమునకు మూలకారణము, మోహ నిర్మూలనమే మోక్షము అన్నారు. కనుక మోక్షమునుకూడ త్యాగం చేయాలి. మోహము పోయిన తర్వాత ఏకత్వమే మనకు సాక్షాత్కరిస్తుంది. ఇటువంటి ఏకత్వాన్ని ప్రబోధింపచేసే దివ్యమైన తత్త్వమే గురుత్వానికి సరియైన అర్థము.

ఈ రోజును గురుపూర్ణిమ అని, వ్యాసపూర్ణిమ అని అనేక విధములుగా ఈ జగత్తునందు వ్యవహరిస్తున్నారు పూర్ణిమ అనగా చంద్రుడు పూర్ణస్వరూపమును ధరించడము. అనగా పవిత్రమైన మనస్సుయొక్క తత్త్వము పరిపూర్ణస్థితిలో ఉండటమే. అనగా అభిమాన, మమకార, అహంకారములతో ఏ మాత్రము సంబంధము లేనటువంటి స్థితియే పూర్ణిమకు సరియైన అర్థము. కనుక గురువుయొక్క హృదయము పూర్ణిమనాటి చంద్రునివలె ఉంటుంది. అలాంటి గురువైనవాడు వ్యాసుడు అనీ 'వ్యాసో నారాయణో హరిః' అని అన్నారు. నారాయణుడే వ్యాసుడుగా వచ్చి జగత్తునకు 'అనంతా వై వేదాః' అనంతమైన వేదతత్త్వాన్ని విభజించి మానవులకు, ఊర్ధ్వలోకమునకు. పోయే అవకాశాన్ని కల్పించచేశాడు. రజోగుణ సంబంధమైన ఈ జగత్తునందున్న ప్రతి మానవునికినీ, సాత్త్వికమైన శుద్ధత్వమైన ఊర్ధ్వస్థానమునకు ప్రయాణము కల్పించచేయడానికి వీనిని కొన్ని రకములైన సోపానములుగా నిరూపిస్తూవచ్చాడు. కానీ దురదృష్ట వశాత్తూ కాల కర్మ కార్య కర్తవ్యాలు మారడంచేత ఈ వ్యాసునియొక్క ఉపదేశములు కూడ విరుద్ధమైన మార్గమును అవలంబిస్తూవచ్చాయి. ఈ నాడు లౌకికమైన భౌతికమైన, కేవలము ఆచారములకు అనుష్ఠానములకు, మనము అలవాటు కావడంచేత మన మనస్సు మరింత బలహీనస్థాయికి దిగజారుతూ వస్తున్నది. జగత్తుకు సంబంధించినది ఏ మాత్రమూ ఉండగూడదు గురుబోధలలో. జగత్తుకు సంబంధించిన బోధలు చేసే ప్రతి గురువు కూడ సరియైన గురువు కాడు. మూలాధారమైన ఆత్మతత్త్వాన్ని మాత్రమే ప్రబోధించే వాడే గురువు.

రజోగుణముకంటే ఊర్ధ్వగతి స్థానమందున్న సాత్త్వికము మరొకటి ఉండగా ఈ రజస్సు,తమస్సుల మాత్రమే ఎందుకు మనం ప్రబోధించాలి? కానీ ఈనాటి ఆస్తికులైనవారు కానీ, ఆధ్యాత్మిక మార్గమున ప్రవేశించినవారు కానీ, క్రమ క్రమేణా అధః స్థానమునకు పోవుటకే అభిలషిస్తూ ఉంటారుకానీ, ఊర్ధ్వ స్థానమునను పోవుటకు అతిశ్రమను అనుభవిస్తుంటారు. ఈ జగత్తునందు ఏది శాశ్వతము ? మరి ఒక్కతూరి విచారించండి. ఆస్తిపాస్తులు శాశ్వతమా ? లేక దేహము శాశ్వతమా ? లేక పదవులు శాశ్వతమా ? ఏది శాశ్వతము ? ఏదీ శాశ్వతము కాదు. సర్వము నశించిపోతుంటుంది. ఐతే ప్రతి పదార్థములో కూడ మంచి అనేటువంటి దివ్యత్వము అంతర్భూతమై ఉంటున్నది. కనుక ఈ మంచి తత్త్వమును చూడటమే నిజమైన ఈశ్వర దృష్టి. ఏదైనా ఒక పుష్పము కానీ, లేక ఒక ఫలముగానీ మంచిగా ఉన్నదంటే ఎవ్వరూ ఏ ప్రశ్న వేయరు. ఇది చెడ్డగా ఉన్నది అంటే ఎందుకు చెడ్డగా ఉంది ? ఎందుకు వాడు చెడిపోయినాడు, ఎందుకు తప్పుగా ఉంది? అని ఇన్ని ప్రశ్నల వర్షం కురిపించుదుమేకాని మంచికి ఇన్ని ప్రశ్నలు వేయము. కనుక చెడ్డకూ, కీడుకు, బాధకు, దుఃఖమునకు మనం ప్రశ్నిస్తున్నామే కానీ మంచికి, సంతోషమునకు, ఆనందమునకు, సుఖమునకు ఎట్టి ప్రశ్నలు కూడ మనము వేయము. కనుక మంచితనము, శాంతి, సుఖము ఇవి ఆత్మస్వభావములు. ఈనాడు అట్టి శాంతము కానీ, అట్టి సుఖము కానీ, అట్టి ఆనందము కానీ మనము కోల్పోయామంటే నిజమైన విచారణాశక్తిని కోల్పోయామన్నమాట.

దివ్యాత్మస్వరూపులారా ! నిజముగా మనయందు అనంతమై, అఖండమై, ఏకత్వమైన ఆత్మతత్త్వము నిబిడీకృతమై ఉంటున్నది. ఇట్టి పరతత్త్వాన్ని మనం విస్మరించి, లోకతత్త్వాన్ని మనం విశ్వసించి మన జీవితమును వ్యర్థం గావించుకుంటున్నాము. కనుక మన జీవతత్త్వము కానీ ఈశ్వరత్వముకానీ ఈ పదార్థ తత్వము కానీ ఈ సత్వతమో రజో గుణములయందు

ప్రతిబింబించేటటువంటి ప్రతిబింబములే కానీ యథార్థ స్వరూపములుకావు. ఈశ్వరస్సర్వ భూతానాం అన్నారు. ఎక్కడ మనం ఆ ఈశ్వరత్వాన్ని చూడాలంటే శుద్ధసాత్త్వికమైన మాయ యందు ప్రతిబింబించేదే ఈశ్వరతత్వము, కనుక అందరియందును ఈశ్వరుడు ఉండినప్పటికినీ, మనము సాత్త్వీక గుణములు పెంపొందింప చేసుకోలేక పోవడంచేతనే ఈశ్వరత్వాన్ని దర్శించలేకపోతున్నాము. మనయందు రజోగుణమనే అవిద్యాశక్తిని అభివృద్ధి గావించుకొనుచున్నాము. కనుకనే దానియందు మనము 'మానవత్వము మానవత్వము' అని అధికంగా స్మరిస్తూ వస్తున్నాము. ఇక తమస్సునందు ప్రతిబింబించేటటువంటిది మేటర్. ఇదే పదార్థము. కొంతమంది జీవతత్వాన్ని కూడ విస్మరించి కేవలము పదార్థమునందే వాళ్ళ ప్రాణాలు వదలుతూ వస్తున్నారు. సంపాదించటమే నా జీవిత కర్తవ్యమనుకుంటున్నారు. ధనమే ప్రాణముగా భావిస్తున్నారు. ఇక లౌకికమైన సుఖములే వాళ్ళ యొక్క జీవిత గమ్యముగా విశ్వసిస్తున్నారు. ఇది కేవలము తమోగుణమునందు ప్రతిబింబించే ఆత్మ తత్త్వము కనుకనే వీరు 'మేటర్' నందు మునిగిపోతున్నారు.

కనుక మేము పదార్థతత్త్వము నందున్నామా లేక జీవతత్త్వము నందున్నామా, ఈశ్వర తత్త్వమునందున్నామా అనేది ఎవరికివారు నిర్ణయించుకొని మార్పు చేసుకోవచ్చు. కనుక ఈశ్వరత్వాన్ని దర్శించాలన్నా సాక్షాత్కరించుకోవాలన్నా, మనయందు ఈశ్వరత్వం ప్రకటించాలన్నా, శుద్ధసాత్త్వికాన్ని ప్రయత్నపూర్వకంగా సాధించాలి. ఈ సాత్వికము, రాజసికము, తామసికము అనే ఈ గుణముల మార్పులవల్లనే సాక్షాత్కారపు మార్పులు కానీ. లేక అధోగతి మార్పులు కానీ, ఊర్ధ్వగతి మార్పులు కానీ మనకు లభిస్తున్నయి. గుణములకు కూడ మనము ఆచరించేటటువంటి కర్మలే ఆధారము. కనుకనే భాగవతమునందు 'కర్మమున పుట్టు జంతువు, కర్మముచే వృద్ధిపొందు, కర్మమున చనున్, కర్మమె నరునకు దైవము కర్మమె సుఖ దుఃఖములకు కారణ మిలలో' కనుక మనము ఆచరించేటటువంటి కర్మల ద్వారానే ఈ సాత్త్వికము, రాజసికము, తామసికమనే గుణములు పెంపొందింప చేసుకుంటున్నాము ఎంతకాలము ఈ జీవిత ప్రయాణము? ఎంత వరకు ఈ జీవితము యొక్క గమ్యము. ఈ సత్యాన్ని మనం గుర్తించుకోలేకపోతున్నాము. కాయమున్నంత వరకు జీవితమనుకుంటున్నాము కాయము కూలుటయే మరణమని భావిస్తున్నాము. కానీ కాయమునకు, జీవితము, మరణము ఏర్పడుతున్నవే కానీ, ఆత్మకు మరణ, జననములు ఏమాత్రములేవు.

కనుక పదార్థమునకు, జీవతత్వమునకు ఈశ్వరత్వమునకు, మూలాధారమైన సత్యము ఒక్కటే. అదే ఆత్మ. ఈఆత్మ అనేటటువంటిది ఉపాధులను పురస్కరించుకుని తను రూపనామాలను ధరిస్తూ ఉంటుంది. కనుకనే దివ్యత్వమనేది అతి మధురమైనటువంటిది. తీపికి ఎట్టి రూపమూ లేదు. కానీ కొన్ని కొన్ని పదార్థములయందు చేరి అది ఆ పదార్థ స్వరూపాన్ని ధరిస్తూ ఉంటున్నది. లడ్డు స్వీటుగా ఉంటున్నది అనుకుంటున్నాము. లడ్డుకు రూపముంది కానీ స్వీటుకు రూపము లేదు. కానీ లడ్డు దేనితో చేయబడినటువంటిది? సెనగపిండితో చేయబడినటువంటిది. కానీ సెనగపిండికి తీపి ఉందా? లేదు. సెనగపిండికి చేరినటువంటితీపి చక్కెరగుణము కానీ, సెనగపిండి గుణముకాదు. అదే విధముగనే ప్రతి పదార్థము కూడ ఉపాధియొక్క భేదము చేతనే రూపనామములు ధరిస్తున్నది ఈ నిరుపాధి ఐనటువంటి సర్వాధారమైనటువంటి ఆత్మకు ఒక్క గుణము కూడ లేదు. ఈ గుణములే వాని

రూపనామములను అమరుసూ వస్తున్నాయి.

ప్రేమస్వరూపులారా! నిజముగా అట్టి పవిత్రమైన ఆత్మతత్వాన్ని గుర్తించడమే ఆస్తికుల యొక్క ప్రధానమైన కర్తవ్యంగా భావించాలి. ఎన్ని జన్మలు ఎత్తినప్పటికీ, ఎన్ని కర్మలు ఆచరించినప్పటికినీ, ఎన్ని విధములైన సత్కర్మలు చేసినప్పటికినీ, ఈ నిజతత్వమైన ఆత్మతత్వాన్ని మనం అర్థంచేసుకో లేకుండిన ఇవి సర్వము కూడ నిరుపయోగమైనవిగా ఉంటాయి. నిజముగా మనము తమోగుణమైన పదార్థ భాగమునుండి రజోగుణముతో మధ్యస్థానమునకు ప్రవేశించినాము. అందువలననే మనము మానవులుగా జన్మించినాము. దీనిని పురస్కరించుకొనియే 'జంతూనాం నరజన్మ దుర్లభం' అన్నాము. ఈ పవిత్రమైన ఆత్మ రానరము ఉన్నత స్థాయికి చేరడమే. ఈ రజోగుణస్థానమైన ఉన్నతస్థాయినుంచి సాత్త్వికమైన ఈశ్వరస్థానానికి ఇంకనూ కొంత ప్రయత్నము చేయాలి. అదియే మనము చేయవలసిన ప్రయత్నము. కానీ తిరిగి అట్టడుగు స్థానమైన తమోగుణమునకు దిగజారడము కాదు.

కనుక ఏనాడు మనలో ఉన్న ద్వేషములు, అసూయలు, అహంకారములు, అభిలాషలు అణగ దొక్కుదుమో ఆనాడే మనలో ఉన్న పశుత్వము కూడ కొంత క్షీణిస్తుంది. ఏనాడు పశుత్వము మనలో నశించునో ఆనాడే మనలో ఉన్న మానవత్వము దివ్యత్వానికి ప్రయాణం సలుపుతుంది. మనము ఈ విధమైన విచారణ చేతనే ఆత్మస్థానానికి చేరుకోడానికి ప్రయత్నించాలి. అనేక గ్రంథములు చదివి వాదోపవాదములు చేసి అనేక విధములైన తెలివితేట పయోగించడంచేత ఆత్మస్థానానికి ఏనాటికినీ, ఎన్ని జన్మలైనప్పటికీ చేరడానికి వీలుకాదు. ఇది మాటలతో కూడిన పదార్థము కాదు. మనస్సుతో కూడిన యథార్థము. మానసికతత్వాన్ని, సాత్త్వికమైనరీతిలో రూపొందింపచేసుకోవాలి. ఇదియే సరియైన ఆధ్యాత్మిక మార్గము.

ప్రేమస్వరూపులారా! మనము భజనలు చేయడం కానీ, జపములు చేయడం కానీ, ధ్యానము చేయడము కానీ, ఇవినిరుపయోగమైనవికావు; సత్కర్మలే. ఈ విధమైన కర్మలతోపాటు మనయొక్క మనస్సును కూడ దానికి జతపరచడం అత్యవసరం. అన్ని కర్మల యందు కూడ, ఆత్మభావాన్ని మనం విచారిస్తూరావాలి. సర్వకర్మలు కూడ ఈశ్వరార్పణ బుద్ధితో చేస్తూ రావాలి. 'నాయొక్క గుణములచేతనే దైవత్వము వికారస్వరూపమును ధరిస్తున్నది కానీ, నిజమైన ఆకారానికి నాయొక్క గుణములు ఏమాత్రము సంబంధం కాదు.' అని తెలుసుకోవాలి. దైవత్వానికి భిన్నముగా ఉంటున్నామంటే నిజముగా మనలో ఉన్న మాయాతత్వమే దీనికి మూలకారణము, మాయ కేవలము మేఘముల వంటిది. ఈమేఘములు కదిలి పోయేవే కానీ స్థిరముగా ఉండేవి కావు. మనదృష్టిని మన లక్ష్యాన్ని, స్థిరముగా, సత్యంగా ఉంచుకున్నప్పుడు కొంత సమయం లోపల ఈ మేఘములు కదిలి పోయి, (సన్) సూర్యుని యొక్క కాంతిని మనం సాక్షాత్కరింప చేసుకోవచ్చును. ప్రకాశించే సూర్యునికి మేఘము అడ్డు వచ్చిన తత్క్షణమే మనదృష్టిని క్రిందికి దింపుకోకూడదు. కదలిపోయేంతవరకును మన దృష్టిని ఏకాగ్రతగా పెట్టుకున్నప్పుడు కొన్ని క్షణముల లోపల తిరిగి సూర్యుని యొక్క బింబాన్ని మనం చూడగలము.

అదే విధముగనే ఈనాడు దైవత్వము అనే ఆత్మ తత్వానికి అనేక కష్టములు, నష్టములు దుఃఖములు, విచారములు ఇలాంటి మేఘములు అడ్డము వచ్చిన

కర్షణమే, దైవత్వము పైనదృష్టిని మరలుస్తున్నాము మనము. ఇట్టి సమయమునందు ఎన్నికష్టములు వచ్చినప్పటికినీ, ఇవన్నీ మేఘములు. కదలిపోయేటటువంటివేకానీ స్థిరముకావు అని మనలక్ష్యాన్ని దైవత్వము మీద స్థిరముగా ఇమిడ్చుకుంటూరావాలి. ఇట్టి ఏకాగ్రతను పెంపొందింప చేసుకునే నిమిత్తమై ధ్యానము అనే మార్గాన్ని మనపూర్వీకులు అందిస్తూ వచ్చారు. ఈ ధ్యానము అనేది అష్టాంగయోగములందు ఏ స్థానములో చేరినది అనేది కూడా మనం విచారించాలి. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన సమాధుల్లో, సమాధికి ముందు స్థానము. ఏడోస్థానమునకు కూడినది. ఈనాడు మనముచేసే జప తపో యాగ యజ్ఞాదులన్నియు కూడ ధారణాశక్తిని పెంపొందింప చేసుకోవడమే. ఒక రూపాన్ని చూసి మనం భజన చేస్తున్నాము అంటే ఇది కేవలము మనము ధారణాశక్తిని అభివృద్ధి చేసుకునేమార్గమే. కనుక జగత్తునందు చేసే సర్వకర్మలు కూడ ధారణాశక్తిని పెంపొందింపచేసుకొనుటే.

ఇల్లు కట్టదలచిన వ్యక్తి ముందు సిమెంటు, ఇటుక, ఇసుక, మట్టి, రాళ్ళు అన్ని ప్రోగుచేసుకున్నట్లుగా ధ్యానమునకు పూర్వము జప తపో యజ్ఞ యాగాదులు అన్నికూడ ప్రోగుచేసుకోవాలి. ఇవన్నీ జరిగిన తర్వాత ధ్యానము అనే ఏకత్వములో లీనమై పోతుంటుంది. చలించకుండా కూర్చోవడము ధ్యానము కాదు. పద్మాసనను వేసుకుని నాసికాగ్రముపై దృష్టినుంచుకోవడం ధ్యానం కాదు. శవమువలె నిలిచిపోవడం ధ్యానము కాదు. నీయొక్క భావమును దైవములో లగ్నము చేయడమే ధ్యానము. ఆ మనసు యొక్క తత్త్వాన్ని దైవమునందు లగ్నము చేయక ఎన్నివిధములుగా నీవు కూర్చున్నప్పటికినీ ఇవన్ని కూడ కేవలము నిరుపయోగమైనవి. నిరర్థకమైనవి. దీనినే భగవద్గీత యందు 'అనన్యాశ్చింతయంతోమాం ఏజనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగ క్షేమం వహామ్యహం' ఆవిధంగా లగ్నమైనటువంటి వాని యోగక్షేమము తానేచూచుకొంటాడు. ఈనాడు మనము ధ్యానమందు మాత్రము మహాస్థిరముగా, మహాశక్తిసామర్థ్యములతో ఉండినట్లుగా కూర్చుంటున్నాము. కాని మనయొక్క చిత్తము అన్యమార్గములో ప్రవేశిస్తుంటుంది. ధ్యానముతో ఏనాడు మన మనస్సు దైవమునందు లీన మవుతుందో అప్పుడే సమాధి ఏర్పడుతుంది. కనుక సమాధిస్థితి కేవలము ఏకత్వమైన దివ్యత్వము. ఇదే ఏకాత్మ భావము. ఇదే గుణాతీతము ఇదే శుద్ధ సాత్వికమైన ఈశ్వరత్వమునకు అతీతము. ఈశ్వరత్వముకూడ శుద్ధసాత్వికముతో కూడినదే కాని, దీనికి అతీతమైనది కాదు. అనగా సత్వగుణమునందు ప్రకటింపచేసి ప్రతిబింబింపచేసేదే ఈశ్వర తత్వము. ఇందులో ఈశ్వరత్వమనగా నేమి? ఐశ్వర్యస్వరూపమే ఈశ్వరత్వము సర్వైశ్వర్యస్వరూపుడే ఈశ్వరుడు కనుక సర్వైశ్వర్య మనగా లోకసంబంధమైన ఐశ్వర్యము కూడ ఈశ్వరత్వములో ఉంటుంది అన్న మాట. కనుక ఇది కూడ ఒక గుణముతో కూడినటువంటిదే. ఈ గుణాతీతమైనటువంటి తత్త్వమే ఆత్మతత్త్వము. అలాంటి ఉన్నతస్థాయికి పోవడానికి సర్వత్రా మనము సాధనల యందు కానీ కర్మలయందుకానీ నిత్యకృత్యముల యందు కానీ. ఆత్మతత్త్వాన్ని అన్నింటియందు చూచే ప్రయత్నానికి తర్పీదుకావాలి. ఈవిధంగా దృష్టిని ఈశ్వరత్వము లోపల, ఆత్మతత్త్వములోపల ఇమిడ్చడం చేత సంసారం యొక్కగతులు ఏ రీతిగా ఉంటుంటవి? దీనియొక్క అష్ట కష్టములు ఏ రీతిగా ఉంటవి? అని మీరు విచారించనక్కర లేదు. అనగా సర్వపదార్థములు, సర్వ జీవులు, సర్వవిధములైన శక్తిసామర్థ్యములు కూడ ఐశ్వర్యములన్నియూకూడ ఈశ్వరత్వము

ఆత్మతత్వమునుండి ఆవిర్భవించినవే కనుక ఆ భావాన్ని మనం అభివృద్ధి చేసుకుంటే భిన్న భేదములు ఏ మాత్రము కూడ మనసుకు తట్టవు ఈ విధమైన సమత్వాన్ని ఏకత్వాన్ని అభివృద్ధి గావించుకున్నప్పుడే మనకు ఆత్మ తత్వముకూడ కొంతవరకు అలవడుతుంది. ఇది అలపడటం కూడ కాదు.

మనమే ఆత్మ స్వరూపులుగా ఉంటున్నాము. దీనిని పురస్కరించుకొనియే నేను సంభాషించుటకు పూర్వము ఆత్మస్వరూపులారా అని, దివ్యాత్మ స్వరూపులారా అని సంభోధిస్తూవస్తున్నాను. అనగా దేహము ఆత్మయే,నీయొక్క జీవుడు ఆత్మయే, మనగుణములు ప్రత్యేకంగా ఉండటంచేత కొన్ని రకములైన ప్రతిబింబములలో మార్పులు కనిపిస్తుంటయి. దీనినే ఉపాధి భేదమంటూ వస్తున్నాము. ఇలాంటి దివ్యత్వమైన ఆత్మ ప్రభోధలను ప్రాచీన కాలమునుండి అనేకులు మహర్షులు నిత్యమూ తెల్ల వారినది మొదలురాత్రి పరుండునంత వరకు విచారణ చేస్తూరావడమే మీమాంస అని చెపుతూవచ్చారు. దీనినేపరిశోధనాశక్తి అన్నారు. ఈ పరిశీలనా శక్తి ద్వారానే వారు సర్వాత్మస్వరూపాన్ని గుర్తించుకో గలిగారు. ఇట్టి ఆత్మతత్వాన్ని గుర్తించుకున్న వాడు, మొట్టమొదటివాడు వ్యాసుడు అందువలననే ఈ పవిత్రమైన పూర్ణిమకు వ్యాస పూర్ణిమ అనే సార్థకనామము ఏర్పడింది. అనేక వ్యామోహములతో, అనేకవిధములైన కర్మబంధములతో అనేక విధము లైన బంధనలతోకూడిన ఈమర్త్యలోకానికి ఆదర్శాన్ని అందించి పవిత్రమైన దివ్యప్రబోధలు వాళ్ళకు సలిపి వాళ్ళను పరిణామపు స్థితికి తెచ్చే నిమిత్తమై అనేక మార్గములు నిర్మిస్తూవచ్చాడు వ్యాసుడు. కనుకనే ఇందులో ఆధ్యాత్మిక మార్గమనేది అత్యవసర మైనది మానవులకు. ప్రేమ స్వరూపులారా ! ఆధ్యాత్మిక మనగా మీరు తెలుసుకున్నారు మనలో ఉన్న పశుత్వాన్ని క్రమ క్రమేణా మనం సాధించడానికి, జయించడానికి, వశముచేసు కోవడానికి ప్రయత్నము చేయడమే సరియైన లక్ష్య మనియు మీరు గుర్తించాలి. ఈ పశుత్వాన్ని మనము సాధించక జయించక ఎన్నివిధములైన యజ్ఞ యాగాది క్రతువులు చేసినప్పటికినీ ఎన్నివిధములైన తపస్సులు ఆచరించినప్పటికినీ ఇవి కేవలము తమస్సు స్థాయికే దిగజారిపోతవి కానీ సాత్వికమైన ఊర్ధ్వ స్థాయికి చేరవు. మనము అనేక విధములైన శ్రమల కోర్చి ధనమును వ్యయముచేసి తిరుపతికి వెళ్ళు తుంటాము. కాశీకి వెళ్లుతుంటాము. బదరీనాథ్‌కు వెళ్లు తుంటాము. హరిద్వార్‌కు పోతుంటాము. కేదార్‌నాథ్ దర్శనం చేస్తుంటాము. ఎన్నిచేసి ప్రయోజనం ఏమిటి? మనలో ఉన్న జంతుభావములు మృగ తత్త్వములు, పశుత్వమును మనం కొంతవరకైనా సాధించుకోగలిగినప్పుడే ఈ యాత్రలయొక్క ఫలి తము కూడ మనకు దక్కుతుంది - మర్మమెరిగిన మరునిమిషములో మనసే మీకు గురుడండీ అన్నారు. కనుకనే నీవు మనస్సునందున్న పశుత్వాన్ని అరికట్టు కున్నప్పుడు ఈ హృదయమే నీకు బదరీనాథము, నీ హృదయమే నీకు కేదారస్వామి, ఈ హృదయమే నీకు తిరుపతి వేంకటేశ్వరులు. సర్వత్రాకూడ నీయొక్క హృదయంగానే ఉంటుంటుంది. అంతేకానీ నేను తిరుపతి వేంకటేశ్వరుని భక్తుడను, నేను శ్రీరాముడి భక్తుడను. నేను శ్రీ కృష్ణుని భక్తుడను అని చెప్పుకోవడం సిగ్గుచేటు కనుక ఈనాడు మనం క్రొత్తగా నేర్చుకోవలసినది ఏమిటంటే ఆధ్యాత్మికము కంటే మనలోఉన్న పశుత్వము వంటి గుణములను మొట్టమొదట సాధించాలి. మానవత్వము నుండి దివ్యత్వములోనికి ప్రవేశించాలి. ఈ విధమైన మార్గమే

ఆధ్యాత్మిక మార్గమని నేటినుండీ విశ్వసించి క్రమ క్రమేణా ఆ పశుత్వము నుండి తప్పించుకుని సాధించు కుని, జయించుకుని, దివ్యత్వస్థానములో చేరాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తూ ఈ యొక్క ప్రసంగాన్ని నేను విరమిస్తున్నాను.

శ్రీవారి దివ్యబోధ,
గురుపూర్ణిమ : 9-7-79.



# మనస్సు

"చెడ్డపనిచేసి మంచిని చెందబోరు
మంచిపనిచేసి కీడును గాంచబోరు
విమ్మమును నాటి చూత ఫలమ్ము గనున ?
నిమ్మఫలమును గనున ? చూతమ్మునాటి"

మనస్సు చాల చమత్కారమైన వస్తువు. దీని స్వరూపము చాలవిశిష్టమైనది, చేష్టలా చాలా విచిత్రమైనవి ఇది ద్విపాత్రాభినయమును గావించు చుండును. దీనికి స్వతస్సిద్ధమైన రూపము లేదు. ఏ పదార్థమును తాను ఆవరించునో ఆపదార్థముయొక్క ఆకారమునే తానుపొందును. మనస్సే దుఃఖము; మనస్సే సుఖము; మనస్సే మంచి: మనస్సే చెడ్డ: మనస్సే నెగటివ్ (Negative). మనస్సే పాజిటివ్ (Positive). కానీ, ఇట్టి మనస్సుయొక్క తత్త్వాన్ని మానవుడు గుర్తించడం ప్రప్రథమైన కర్తవ్యం. ఈ మనస్సు ఒక కాలువయందు పారే నీరునంటిది. ఆ కాలువయొక్క ఆకారమును పురస్కరించుకొనియే జలముయొక్క ఆకారము వుంటుంది. ఈ కాలువ జలమును ప్రవహింపచేసే భూమియొక్క ఆకారమును పురస్కరించుకొనియే జలాకారము కూడ వుంటుంది. కాని ఈ జలమునకు ఒక స్వతస్సిద్ధమైన రూపములేదు అదేవిధముగనే మానవునియొక్క మనస్సుకూడను. ఆ పదార్థాకార భ్రాంతులను పురస్కరించుకొనియే తనయొక్క స్వరూపాన్ని నిరూపిస్తూ వచ్చింది.

అగ్నికలదు. ఈ అగ్నిని వెలిగించుకొని చీకటిని దూరం చేసుకొని, ఆ వెలుతురుద్వారా మనము అనేక నిత్య కృత్య కర్మలను ఆచరించడానికి ఉపకారిగా వుంటుంది. లేక చలిమంటగా వేసుకొని మనకు ఆవరించిన చలిని దూరము చేసుకొని హాయిని కూడ అందుకోడానికి సహాయకారిగా ఉంటుంది. కానీ, అదే అగ్నిని మన ఒంటికో ఇంటికో పెట్టుకున్నప్పుడు అది చాలా అపకారిగా మనలను పీడించుతుంది. ఇది అగ్నియొక్క దోషమా ? లేక మన భ్రాంతియొక్క చెర్లాటమా? మన భ్రాంతులు, మన ఇచ్ఛాశక్తులు, మన వాసనాశక్తులు, ఇవే మూలాధారములు. మన చేతియందు ఒక కత్తి కలదు. అది పండును కోసి భుజించడానికి ఉపకారిగా ఉంటుంది. లేక కూరగాయలను తరుగుకొనుటకు ఉపకారిగా ఉంటుంది. అదే కత్తి ఏదైనా కోపమో లేక విరోధమో ఉండినప్పుడు ఇతరులను హింసించి తద్వారా అపకారిగా తయారవుతుంది. అదేవిధముగానే మన మనస్సు యొక్క తత్వము మనయొక్క ఉపయోగమును పురస్కరించుకొనియే మంచిచెడ్డలతో రూపొందుతూ వస్తుంది. కనుక మానవుడు, మనస్సును సన్మార్గము నందు ప్రవర్తింపచేసి, తద్వారా తన జీవితమును ధన్యము గావించుకోటానికి ప్రయత్నము చేయడమే కర్తవ్యము.

—బాబా.

# నమస్కార శతము

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

ఆడిన మాటలో నమృతత్వ మొలికించు
వేదాంత సారంబు వెల్లి విరియ
పాడిన పాటలో పారవశ్యము గూర్చు
ప్రవిమలంబౌ భక్తి పరిమళింప
చూచిన చూపులో క్షుభిత చిత్తములపై
కారుణ్య పీయూషధార గురియ
చేసిన చేతలో జీవరాసుల కెల్ల
శ్రేయముల్ చేకూర్చు రీతిదోప
సత్య ధర్మ శాంతి ప్రేమ సాధనంబె
ప్రథమ కర్తవ్యమని బోధ పరచుచున్న
పుణ్య పురుషుడ వవతారమూర్తి వీవు
సత్యసాయీశ్వరా! నమస్కార శతము.

అది ఉపన్యాసమా! అతులితాత్మ జ్ఞాన
తత్త్వ బోధక వాక్ సుధా స్రవంతి
అది భక్తి గీతమా! అఖిల సాధక చిత్త
నైర్మల్య సంపాద నౌషధమ్ము
అది మందహాసమా! అతి దుర్భర వ్యథా
తిమిరాపహరణ చాంద్రీ విభూతి
అది వస్తు సృష్టియా! ఆస్తిక్య భావ సం
స్థాపకామూల్య ప్రసాద గరిమ
అనుచు భక్తులు తలపోయ ననుదినంబు
సకల జనముల భాగ్యాతిశయము చేత
మానుషాకృతి బూని మా మధ్యనున్న
సత్యసాయీశ్వరా! నమస్కార శతము.

వినిపింతు వొకమారు వీనుల విందుగా
గిరిధర గోపాల కీర్తనంబు
చూపింతు వొకమారు చుబ్బన చూఱగా
ప్రవిమల దివ్యలీలా విభూతి
బోధింతు వొకమారు పున్నెంపు పంటగా
కర్మఫలాతీత ధర్మ పథము
కురిపింతు వొకమారు కోరికల్ దీరగా
అభయ ప్రదానుగ్రహామృతమ్ము
జప తపో దీక్షనైన యజ్ఞములనైన
పడయ లేనట్టి త్వత్పద స్పర్శ మాకు
కలియుగంబున గలిగె భాగ్యంబు విరిసి
సత్యసాయీశ్వరా! నమస్కార శతము

# జన్మదినోత్సవము

ప్రశాంతి నిలయములో భగవాన్ బాబావారి జన్మదినోత్సవ సందర్భముగా భగవాన్ దివ్యసమక్షములో జరుగనున్న కార్యక్రమము.

నవంబరు - 18వ తేది — పుట్టపర్తిలో రథోత్సవము.
,, - 20-21వ తేది — అఖిల భారత బాలవికాస్ గురువుల సమావేశము.
,, - 22వ తేది — అఖిల భారత బాలవికాస్ పిల్లల సమ్మేళనము
,, - 23వ తేది — జన్మదినోత్సవం



## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | గీతావాహిని | 3-50 | 0-25 |
| 3. | ధ్యాన వాహిని | 1-50 | 0-15 |
| 4. | జ్ఞానవాహిని | 1 00 | 0-10 |
| 5. | ప్రేమవాహిని | 1-00 | 0-10 |
| 6. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 7. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 8. | ఆత్మారామం | 5-00 | 0-50 |
| 9. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 10. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-30 |
| 11. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-25 |
| 12. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-30 |
| 13. | మణిమాల | 2-00 | 0-15 |
| 14 | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 15. | భజనావళి | 2-00 | 0-20 |
| 16. | సందేహ నివారిణి | 2-00 | 0-20 |
| 17. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |

ఆంధ్ర రాష్ట్రపు, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, బి. ఐ. సత్యమూర్తిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి, యం, యె., బి. యల్.

# శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134

## పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

**A** (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్. |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘానిస్థాన్ | 16 | 26 | | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 43 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసునందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

**B**(1) **పుస్తకములు :** ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన, రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. **V.P.P.** ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

---

( పుస్తక సూచి 264 వ పుటలో చూడండి )

